




# కథలు

నీతి, పురాణ, పొడుపు

# భేతాళ కథలు





## సదాశివ సమారంభాం

గురు దక్షిణామూర్తి

గురు వేదవ్యాస మహర్షి

గురు శుక మహర్షి

గురు నారద మహర్షి

గురు వాల్మీకి మహర్షి

గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం

గురు దత్తాత్రేయ

గురు బాబాజీ

గురు గౌతమ బుద్ధ

గురు ఆదిశంకరాచార్య

గురు రామానుజాచార్యులు

గురు జ్ఞానేశ్వర్

గురు రవిదాస్

గురు కబీర్ దాస్

గురు చైతన్య మహా ప్రభువు

గురు నానక్

గురు రాఘవేంద్ర స్వామి

గురు వీరబ్రహ్మేంద్ర స్వామి

యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం

గురు త్రైలింగ స్వామి

గురు లాహిరి మహాశయ

గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి

గురు వివేకానంద

గురు సాయి బాబా

గురు అరబిందో

గురు రమణ మహర్షి

గురు యోగానంద

గురు భక్తివేదాంత ప్రభుపాద

గురు మళయాళస్వామి

గురు విద్యాప్రకాశానందగిరి

గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..



నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. మహానుభావులైన సాధకులు, జిజ్ఞాసువులు జ్ఞాన ప్రచారార్థం తాము సేకరించిన విలువైన గ్రంధాలను **ఆర్కైవ్** వెబ్ సైట్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ సైట్(https://archive.org), గూగుల్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **ఆర్కైవ్** వారి వెబ్ సైట్: https://archive.org/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు*

## ఆర్కైవ్ వారి వెబ్ సైట్:

## https://archive.org/

Internet Archive: Digital Li ×

https://archive.org

INTERNET ARCHIVE

Web Video Texts Audio Software About Account TVNews OpenLibrary

Universal access to all knowledge

Donate | Store | Blog | FAQ | Jobs | Volunteer Positions

Search: All Media Types Advanced Search Hello Komireddy (not you? sign in or log out) Upload

**Announcements** (more)

- Millions of historic images posted to Flickr
- Zoia Horn, librarian and activist, dies
- Working to Stop Rewriting Copyright Laws via TPP Treaty

**Web** 426 billion pages saved over time

INTERNET ARCHIVE WayBackMachine http:// BROWSE HISTORY

**Welcome to the Archive** RSS

The Internet Archive, a 501(c)(3) non-profit, is building a digital library of Internet sites and other cultural artifacts in digital form. Like a paper library, we provide free access to researchers, historians, scholars, the print disabled, and the general public.

**Video** 1,721,625 movies — Browse (by keyword)

Curator's Choice (more)

Noveltoon: The Stupidstitious Cat
A very superstitious cat tries to catch Buzzy for breakfast but Buzzy outsmarts him. Animation by...

Recent Review

Little Ol Bosko In Bagdad
Average rating:

**Live Music** 131,731 concerts — Browse (by band)

Curator's Choice (more)

Yarn Live at Towne Crier Cafe on 2014-02-16
01. intro 02. Time Burns On 03. I Hate You 04. Down On Your Luck 05. Lost Cause 06. Christopher...

Recent Review

Grateful Dead Live at Merriweather Post Pavilion on 1985-06-30
Average rating:

**Audio** 2,095,303 recordings — Browse (by keyword)

Curator's Choice (more)

contra32: Infex - Type-E
How exactly does one create a golem? Although there are many variations in recorded methods and...

Recent Review

KM/TB Sol Rezza 2014
Average rating:

**Texts** 6,509,320 texts — Browse (by keyword)

Curator's Choice (more)

The Orchid world. A monthly illustrated journal...
No more published

Recent Review

الأسطوانة الرابعة 04 - أبحاث علمية - تربية وتعليم
Average rating:

**Most recent posts (write a post by going to a forum) more...**

| Subject | Poster | Forum | Replies | Date |
|---|---|---|---|---|
| PLEASE DELETE | kiwi9000 | forums | 0 | 1 hour ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: HELP!! need shows recommendations | wmonola | GratefulDead | 0 | 2 hours ago |
| Re: You don't have to ask, cause you already know | wmonola | GratefulDead | 0 | 2 hours ago |
| Re: HELP!! need shows recommendations | wmonola | GratefulDead | 0 | 2 hours ago |

**Institutional Support**

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# భేతాళుని కథలు

## చంద్రగుప్త ఆదిత్యుడు - ఉజ్జయినీ రాజ్యము

పూర్వకాలము అనగా యిప్పటికి 16 వందల సంవత్సరముల క్రిందట- ఉజ్జయినీ నగరాన్ని చంద్రగుప్త ఆదిత్యుడనే రాజు పాలించేవాడు. ఈతనికే చంద్రవర్ణ ఆదిత్యుడని పేరుకూడ ఉండేది.

ఈ ఉజ్జయినీ నగరంలో చిత్రఖరేయను ఒక వేశ్య యుండేది. ఆమె కులమున వేశ్యగా బుట్టినను మంచి శీలము గలిగి ఉండేది. చిత్రరేఖతల్లి మదన రేఖ కూతురును కులవృత్తిరీత్యా ఆమెకు ఏ మహారాజుచేతనో, చక్రవర్తిఅంతటి ధనవంతుని చేతనో కన్నెరికము చేయించి- చిత్రరేఖను ఒక వేశ్యగా చేయాలని ఆలోచించేడిది.

చిత్రరేఖ మిక్కిలి అందగత్తె. అందుకు తగిన విద్యాబుద్ధులు కూడా ఆమెకు వన్నెదెచ్చినవి. ఆమె గుణగణములు గూర్చి, అందమును గూర్చి ఎంద రెందరో మహారాజకుమారులకు తెలిసినది. అందువలన చిత్రరేఖను పెండ్లాడ వలయునని, కనీసము ఆమెను తమ రాజస్ధానమున నర్తకిగా చేసుకోవలయు ననియు ఉర్రూత లూగేవారు.

చిత్రరేఖ మాత్రం అందుకు సమ్మతించెడిదికాదు. తల్లియగు మదన రేఖ ఆమెను ఉపయోగించుకొని, బాగా ధనము గడించాలని అనుకొనేది. కానీ, చిత్రరేఖ ఈ విషయంలో తల్లిని యెదిరించి, తానొక సంసారిక జీవితమునే గడుప వలెనని నిశ్చయించుకొన్నది. సకల శాస్త్రములు తగిన గురువుల వద్ద అభ్యసించి "చదువుల సరస్వతి"గా విరాజిల్లినది.

అట్టి సమయంలో ఒకనాడు ఒక బ్రాహ్మణ యువకుడు ప్రయాణము చేయుచూ వచ్చి, చిత్రరేఖ మందిరప్రాంగణంలో ఆ రాత్రి శయనించినాడు, ఎన్ని రాత్రులనుండియో నిద్రలేక పోవుటవల్లనో ఏమో- రాత్రి నిదురబోయిన ఆ బ్రాహ్మణ యువకుడు సూర్యోదయమైనను ఆ మందిరపు అరుగుమీదనే పండుకొనియున్నాడు.

ఉదయమున దాసీలు ఊడ్చుటకువచ్చి. అతనిని జూచి మదన రేఖకు విన్నవించారు. ఆమె కూతురగు చిత్రరేఖతో వచ్చి— ఆ బ్రాహ్మణ యువకుని చూచినారు. నవమన్మథాకారుడైన అతని సోయగమును గాంచి- చిత్రరేఖఎంతయో ఆనందించినది, మనసారా ప్రేమించినది.

అందువలన, ఆమె కోరికతో తల్లి మదనరేఖ అతనిని తమ మందిరం లోనికి సేవకులతో చేర్పించి, శీతలోపచారములు చేయించిరి. కొంతసేపటికి వారి ఉపచర్యలవల్ల బ్రాహ్మణ యువకుడు నిద్రనుండి మేల్కొని వారిని గాంచి "ఎవరు మీరు? నేనీ హంసతూలికా తల్పమునకు ఎట్లు వచ్చితిని? నన్నీ విధంగా సేవదీర్చినందులకు మీకెంతయో కృతజ్ఞుడను" అని పలికెను.

ఆ బ్రాహ్మణ యువకునకు మెలకువ వచ్చినప్పటికి, అతని ప్రక్కన చిత్రరేఖయే యుండెను. అందువలన ఆమె- అతనిని జూచి "మహాత్మా! మేమే యిక్కడకు చేర్పితిమి. మీరు 4, 5 రోజులనుండి నిద్రలేకునట్లుంది; గాఢంగా నిద్ర పోవుచున్నారు, మీ నిద్రకు భంగం రాకుండా, మీకు ఎట్టి ఆటంకము కలుగకుండా నేను చూచుచున్నాను. నా పేరు చిత్రరేఖ. కులమున వేశ్యను, మీరెవరు? ఏ గ్రామమునుండి వచ్చితిరి ? ఎందులకు వచ్చితిరి ?" అని ఆప్యాయముగా అడిగినది.

అప్పుడా బ్రాహ్మణ యువకుడు- "చిత్రరేఖా! నేను బ్రాహ్మణ వంశమున పుట్టినవాడను. పేరు విద్యాసాగరుడు. పేరులోనే విద్యగలదు కానీ, నాకు ఏ విద్యా సరిగారాదు. అందువలన తల్లిదండ్రులు, సోదరులు, బంధువులు, స్నేహితులు నన్ను ఎంతో హేళన చేసేవారు. నన్నొక తృణమును జూచినట్లు చూచి, అగౌరపరిచేవారు.

# విద్యాసాగరుని కథ

అందువలన నేనొకనాడు ఎవ్వరికీ చెప్పకుండా, విద్య నేర్వాలన్న పట్టుదలతో యిల్లు విడిచి బయలుదేరాను, ఎంతమందినో ఆశ్రయించాను. కానీ, నా కోరిక తీరలేదు. అయిననూ నా పట్టువిడవక బయలుదేరాను. ఒక అడవిలో నొక బ్రహ్మరాక్షసి వలన సకల విద్యలు నేర్చుకొన్నాను. నాకు విద్యలు నేర్పిన ఆబ్రహ్మరాక్షసి శాపవశమున బ్రహ్మరాక్షసి. కాని, నిజముగాఆయననొక గంధర్వుడు. శాపముదీరి ఆయన నన్ను దీవించి తనలోకమునకు వెళ్ళిపోయినాడు. నేను ఆయన సెలవుపొంది యింటికి బయలుదేరినాను. మధ్యమార్గమున నిద్రలేమివలన,ఆహార లోపమువలన అలసటతో మీ యింటి అరుగుపై పరున్నాను" అని తెలియ జేసినాడు.

ఆతని వాక్యములకు ఆ తల్లీ కూతుండ్రు మిక్కిలి ఆనందించినారు. చిత్రరేఖ ఆతనికి తన కోరిక వెల్లడిస్తూ "తనను ప్రేమించుమని, పెండ్లాడుమని" ప్రార్ధించినది. తల్లికూడా తన ఆమోదము తెలిపినది.

అందులకు ఆ బ్రాహ్మణ యువకుడు "చిత్రరేఖా! నేను బ్రాహ్మణ వంశమున జన్మించినవాడను. నీవు వేశ్యకులమున జన్మించినదానవు. పర పురుష

సంపర్క మెరుంగని కన్యకవే అయినా, నా మనస్సు అంగీకరించుట లేదు. బ్రాహ్మణ కన్యకవే అయితే ఆనందంతో స్వీకరించేవాడను. ఇక-నీవు నాకు ఎంతయో పరిచర్యగావించి నాకు ఆనందం కలిగించావు. ఇందుకు నేను నీకెంతయో ఋణపడియున్నాను. ఇందుకు ప్రత్యుపకారం "పెండ్లిమాట" తప్పించి కోరుకొనుము. తప్పక తీర్చి ఋణవిముక్తుడ నగుతాను" అని సమాధానము చెప్పాడు.

## మదనరేఖ మహారాజును దర్శించుట

ఆయన మాటలకు చిత్రరేఖ సమ్మతింపలేదు. "నీవు నన్ను పరిణయయాడనిచో మరణిస్తానుకాని, జీవించలేను" అని ఖచ్చితముగా విన్నవించింది. "కూతురు ఎక్కడ మరణిస్తుందో" అన్న భయంతో తల్లియగు మదనరేఖ ఆ దేశపు మహారాజునకు విన్నవించుకొని "నా కూతురుకు ప్రాణదానం చేయించు" డని వేడుకొన్నది.

వెంటనే మహారాజు-విద్యాసాగరుని తన వద్దకు పిలిపించాడు. ఆతని రూపురేఖా విలాసములకు చాలా మురిసిపోయాడు. "విద్యాసాగరా! నీకు తెలియని ధర్మములు ఉండవనియే తలంచుచున్నాను. నీకు రాత్రింబవళ్ళు సేవచేసి నిన్ను రక్షించునది; నీకు మనసిచ్చినది. నీవు కాదన్నచో మరణించ గలదు. కావున ఆమెను భార్యగా స్వీకరించుము" అని బోధించాడు.

విద్యాసాగరుడు మహారాజును చూచి "మహారాజా! ఇది నా బ్రాహ్మణత్వమునకు భంగకరమైనది. ఆమెను మీరన్నట్లు స్వీకరించుటకు బ్రాహ్మణ కన్యక కాదుగదా?" అని తిరిగి మహారాజునే ప్రశ్నించాడు.

మహారాజు బాగా ఆలోచించాడు. "విద్యాసాగరా! మంచిది. నీవన్నట్లు

"వరరుచి" మహాపండితుడయ్యాడు. భట్టి మహామంత్రి అయాడు. భర్తృహరి సైన్యాధిపతి అయాడు. ఈతడు తన చివరికాలంలో, భార్య మరణానంతరం విరాగియై-అనేక సుభాషితాలు వ్రాసి, లోకమున ప్రసిద్ధ పురుషుడైనాడు.

## విక్రమార్కుడు వేటకు బయలుదేరుట

విక్రమార్కుని పరిపాలనలో ఉజ్జయినీనగరం మిక్కిలి ఉన్నత స్థితికి వచ్చింది. విక్రమార్కుడు ధర్మము తప్పకుండా ప్రజలను పోషించాడు. ప్రజలకు ఏ హానీ రానీకుండా కంటికి రెప్పలా కాపాడుచుండేవాడు. విద్వాంసులను, పండితులను, కవులను, కళాకారులను ఆదరిస్తూ వారి ఆశీర్వాదములు పొందుచుండేవాడు. వేయేల! విక్రమార్కుడు రెండవ ఇంద్రుడా! అన్నట్లు మహా భోగభాగ్యాలతో ప్రసిద్ధి గాంచాడు.

ఒకనాడు విక్రమార్కుడు మంత్రియైన భట్టితో, విలువిద్యానిపుణులైన వేటగాండ్రతో వేటకు బయలుదేరాడు. ఉజ్జయినీ నగరానికి పరిసరారణ్యంలో "క్రూరమృగ సంచారం" ఎక్కువ అగుటచే సమీపగ్రామవాసులు భయపడి-మహారాజుకు విన్నవించుకొన్నారు. అందువలననే-వేటకు బయలుదేరాడు విక్రమార్కుడు. క్రూరమృగములను చెండాడి, కోయవాండ్రకు-ఆయాప్రాంతాలలో నివసించే గిరిజనులకు సౌఖ్యము కలిగించాలని.

విక్రమార్కుడు వేటకు తగిన వస్త్రధారణ గావించుకొని, రథము నెక్కి-బయలుదేరాడు. ఆయన వెనుక రథముపై భట్టి-ఆ తరువాత విలుకాండ్రు, వేటకాండ్రు, వేటకుక్కలు-చిక్కములు, వలలు మొదలగువానితో పరిజనులు, బయలుదేరారు. మృగములను చప్పుడుచేసి బయటకురప్పించుటకు కావలసిన వాయిద్యములతో కొంతమంది సేవకులుకూడ బయలుదేరారు.

విక్రమార్కుడు మిక్కిలి చాకచక్యముతో-క్రూరమృగములను హతమార్చినాడు; ఆయా గిరిజన ప్రాంతీయులకు మృగబాధ లేకుండా చేసినాడు. ఆయా గిరిజనప్రజలు మిక్కిలి ఆనందించి, మహారాజు మెచ్చునట్లు—తమసంతోషం ప్రకటించుచు నృత్యగానములచే విక్రమార్కుని ఆనందపరచినారు. విక్రమార్కుడు తిరిగి నగరానికి బయలుదేరినాడు.

## గూఢచారి విక్రమార్కునికి కాళికాదేవి గురించి తెలియజేయుట

విక్రమార్క భూపాలుడు నగరంలోనేగాక, దేశదేశాలు గావించి ఆయాప్రదేశముల "వింతలు-విశేషాలు" తెలిసికొనివచ్చి విన్నవించుటకు అనేక మంది భటులను నియమించినాడు. వారు ఆయా ప్రాంతాలను సందర్శించి వచ్చి "వింతలు-విశేషాలు" విన్నవించేవారు.

విక్రమార్కుడు వేట ముగించి, తన పరివారంతో నగరానికి బయలుదేరారు. ఆ సమయంలోకి, దేశదేశాలను సంచరించే భటులు యిద్దరు ఒక భిల్లునితో అటకు వచ్చి, విక్రమార్కుని జూచి యిలా అన్నారు.

"మహారాజా! మేము అనేక దేశాలు చూచాము. మన సామ్రాజ్యానికి చెందిన అనేక ప్రాంతాలను గూడ చూచి వచ్చాము. సర్వత్రా-మేము జూచిన అన్ని ప్రాంతాలలోను-తమను గూర్చి పొగిడేవారే తప్ప, నిందించేవారే మాకు కన్పించలేదు-మేము చూచిన ఒక ప్రదేశంలో ఒక మహాద్భుతమైన విశేషము కనిపించింది. అదేమనగా-వింధ్యారణ్య సమీపమునగల ఒక కీకారణ్యములో ఒక కాళికామాత ఆలయమున్నది. అందు దేవీ విగ్రహం మహాభీకరాకారముగల్గి యున్నది. దేవీ విగ్రహం ముందు ఒక నుయ్యిలా పెద్ద అఘాతం ఉంది.

అందుండి పైవరకు అనేక త్రిశూలములు ఉన్నాయి. వానికి పైన ఒక తొట్టె ఉన్నది. ఆ అఘాతముపై గల గట్టుపై నిలిచి, ఎగిరి ఆ తొట్టెను పట్టుకొని ఖండించిన వానికి దేవి ప్రత్యక్షమై కోరిన వరముల నిచ్చునట! అట్టి ప్రకటన గల శిలాఫలకము అందున్నది.

ప్రభూ! ఆ గట్టున నిలబడి, ఎగిరి, తొట్టెనందుకొని ఖండించినచో - అట్టివారు తప్పక—ఆ త్రిశూలములపై బడగలరు; శరీరమున దిగిపోగలవు. ఆ త్రిశూలములంత పదునుగల్గి యున్నవి.

అక్కడ ఆ శిలాఫలకముపై ఉన్న వ్రాత చూచి, భయపడి ఎవ్వరూ అందుకు సాహసించుటలేదు. ఇప్పటికీ ఎన్నియో సంవత్సరములనుండి అలాగు ననే యున్నదట! ఈ భిల్లుడు కూడ ఎన్నియో సంవత్సరాలనుండి చూస్తున్నా డట! కానీ, ఇంతవరకునూ అట్టి సాహసం ఎవ్వరూ చేయలేదట! మేమా ప్రాంతమను చూచినాము; అది చాల భయమును గల్గించు చున్నది. దేవరవారు చూడదలచుదురేమోనని యీ బిల్లునికూడా తీసుకొని వచ్చినాము. ఆ మార్గమంతయు వీనికి బాగుగా దెలియును. ఈతని సహాయము తోనే మేమా జగన్మాతను చూడటం, మరల సరియైన మార్గమునకు రావడం జరిగింది" అని విన్నవించారు.

వారిమాటలను ఆలకించిన విక్రమార్క-భూపాలునికి ఆ విచిత్రమేమిటో టంపే చూడాలని ఉత్సాహము కలిగినది. వెంటనే భట్టిని జూచి "సోదరా! నీవు రాజ్యమునకు పోయి నేను వచ్చువరకు రాచకార్యములు చూచుచుండుము. నేను ఆ విచిత్రమేదియో చూచి వచ్చెదను" అని పలికి భట్టిని రాజ్యమునకు పంపించెను. తాను భిల్లుని సాయముతో ఆ కీకారణ్యమునకు బయలుదేరెను.

## విక్రమార్కుడు కాళికాదేవి ఆలయము దర్శించుట

ఆ మార్గము చాల భయంకరంగా ఉంది. క్రూరమృగ సంచారము లోయలు, గుహలు, ముళ్ళపొదలు విశేషముగా ఉంది. అయినా విక్రమార్కుడు వెనుకంజ వేయలేదు. క్రమముగా ఆ యిరువురు కాళికాదేవాలయం చేరుకొన్నారు. గూఢచారి చెప్పిన దానికన్నా అక్కడ ఆ లోయ (నూయి వంటిది) మహా భయంకరముగా ఉంది. అందుండి అనేక త్రిశూలములు మంచి పదునుగల్గి మిలమిల మెరుస్తూ ఉన్నాయి. వానిమీద పెద్ద మద్ది వృక్షము కొమ్మకు వ్రేలాడుతున్న ఏడు ఇనుప గొలుసులు వ్రేలాడుతూ ఉన్నాయి. ఆ మద్ది వృక్షము ఎక్కిగాని, లేదా క్రిందగల గట్టుపై నుండి ఎగిరిగాని ఆ ఏడు గొలుసులను పట్టుకొని, ఒక్కవేటున ఖండించాలి. అట్టి సాహసవంతునికి దేవి ప్రత్యక్షమై కోరిన వరములు యిస్తుంది. ఇదీ సారాంశం. ఖండించిన వెంటనే అతడు తప్పక త్రిశూలములపై పడిపోగలడు. త్రిశూలములు అట్టివాని శరీరమునుండి దూసుకొని పోగలవు.అయినా విక్రమార్కుడు భయపడలేదు.

## విక్రమార్కుడు ఉట్లను ఖండించుట

విక్రమార్కుడు బాగా ఆలోచించాడు. "కాళీమాత ఈ పరీక్ష ఎందుకు పెట్టిందో! ఉట్లు తెగగొట్టిన వెంటనే, అతడు త్రిశూలముపైబడి ప్రాణములుగోల్పోవును. అట్టివానికి శ్రీ మాత ఎట్టివరములు ప్రసాదించును! ఇందు ఏదో మహత్తు ఉండి యుండును. ఏదియైనను భయపడి వెనుకంజవేయుట చాల నీచమయిన కార్యము. రాచపుట్టుకగల నా వంటి వానికి యీ పిరికితనం మంచిదికాదు" అని నిశ్చయించుకొన్నాడు.

వెంటనే ఒరనున్న ఖడ్గమును చేత ధరించాడు. దేవికి మనసార సమ

స్కరించుకొన్నాడు. గట్టుపైకెక్కి ఎగిరి ఆ ఉట్లను అందుకొన్నాడు. ఏడు ఉట్లను వామహస్తములోనికి తీసుకొన్నాడు. దక్షిణ హస్తమునగల ఖడ్గముతో ఒక్క వ్రేటున ఆ ఏడు ఉట్లను ఖండించాడు.

ఇంకేమున్నది! పైన యిక ఏ ఆధారము లేకపోవుటచే విక్రమార్కుడు త్రిశూలముల మీద పడిపోయాడు. కానీ, విక్రమార్కునికి ఆ త్రిశూలములు గ్రుచ్చుకోలేదు. కాళీమాత అదృశ్యరూపముగా వానిపై యుండుటచే– ఆ దేవి, అలా పడిన విక్రమార్కుని కరముల నెత్తిగొని వచ్చి గట్టుపై నిల్చింది. మురిపెముతో యిలా వుంది.

## కాళీమాత సాక్షాత్కారము

"నాయనా! విక్రమార్కా! నీ సాహసానికి నేనెంతయో ఆనందించుచున్నాను. నీ వంటి సాహసి చిరకాలము యీ ధరిత్రి పాలించుట ధర్మము. కావున నీవు వేయి సంవత్సరములు రాజ్య పరిపాలనము చేయుదువుగాక! నీసోదరుడు, నీ మంత్రియైన భట్టికూడ నీ వేయి సంవత్సరముల పరిపాలన ముగిసేవరకు నీ తోడనే ఉండును. అంత్యమున మీరిరువురును నాలోనే ఐక్యమవుదురుగాక!" అని ఆశీర్వదించినది.

విక్రమార్కుడు చేతులుమోడ్చి "అమ్మా! నీవీ దుర్గమారణ్యములో ఉండుటకంటె– రాజ్యములోనే నివసించుచుండుము. మా కుటుంబములేగాక ప్రజలును నిత్యము నిన్ను పూజించుకొందురు" అని ప్రార్థించెను. కాళీమాత సమ్మతించెను.

తరువాత విక్రమార్కుడు కొలది దినములకే–ఆ కాళికామాత విగ్రహంను ఉజ్జయిని నగరమున ప్రతిష్ఠింపజేశాడు.

కాళికామాత అనుగ్రహం పొంది, రాజధానికి చేరుకొన్నాడు. జరిగిన దంతా భట్టికి తెలియజేసి, దేవి యిచ్చిన వేయి సంవత్సరముల ఆయు పరిమాణ మునుగూడ తెల్పి "మన మిర్వురము వేయి సంవత్సరములు హాయిగా, విడి పోకుండా జీవించగలము" అని ఆనందంతో భట్టిని కౌగలించుకొన్నాడు.

## భట్టియుక్తి — వేయిని రెండు వేలుగా మార్చుట

మహారాజు మాటలు విన్న భట్టి బాగా ఆలోచించాడు. మందహాసంతో యిలా అన్నాడు. "మహారాజా! దేవి మనకు వేయి సంవత్సరాల ఆయుస్సు నిచ్చింది. ఆ వరాన్ని పురస్కరించుకొని నేను ఆ వేయిని, రెండువేల సంవత్స రాలుగా నేను కూడ వరాన్ని యిస్తున్నాను.

"అదెలా?" అని మహారాజు ప్రశ్నించాడు.

"ఏముంది! కాళీమాత వేయి సంవత్సరాల రాజ్య పరిపాలనము చేయు దువని ఆశీర్వదించినదిగదా! నీవు ఆరు మాసములు రాజ్య పరిపాలనము, ఆరు మాసములు దేశ సంచారము చేయుచుందుము. మీరు లేని సమయములో నేను రాచ వ్యవహారములు చూచుచుందును. ఈ విధముగా చేసినచో రెండువేల సంవత్స రములు మనం జీవించవచ్చును గదా!" అని బదులు చెప్పాడు భట్టి.

భట్టి యుక్తికి మహారాజు ఎంతో సంతోషించాడు. భట్టి చెప్పిన ప్రకారముగానే ఆనాటినుండి విక్రమార్కుడు ఆరునెలలు రాజ్యపాలనము, ఆరు నెలలు దేశసంచారం చేయుట ప్రారంభించినాడు.

వింధ్యారణ్యములో నున్న కాళికామాత విగ్రహమును గొనివచ్చి- ఒక శుభముహూర్తములో ఉజ్జయినీ నగరంలో ప్రతిష్టించినారు. ఆనాటి నుండి

ఆ కాళీమాత నిత్య పూజలతో వెలుగొందుచున్నది. నేటికిగూడ ఆ ఉజ్జయిని నగర కాళీమాత మహా ప్రఖ్యాతితో కొలవ బడుచున్నది.

## సన్యాసి-విక్రమార్కుడు

విక్రమార్క భూపాలుడు ఈ విధముగా అనగా, భట్టి ఉపదేశించిన ప్రకారము ఆరునెలలు రాజ్యపాలనము; ఆరు నెలలు దేశసంచారము చేయుచు ప్రజారంజకముగా పరిపాలన చేస్తున్నాడు.

అదే సమయంలో ఉజ్జయినీ నగరానికి పది క్రోశుల దూరములో గల ఒక కాళికాలయంలో ఒక పరివ్రాజకుడు (సన్యాసి) ఎన్నో యేండ్లనుండి తపస్సు చేస్తూ ఉన్నాడు. దేవి అతని తపస్సుకు మెచ్చి, ప్రత్యక్షమైంది. ఆ సన్యాసి ఆమెను మోక్షము కోరలేదు. ఆశాపూరితుడై "తల్లీ! ఈ లోకమందే నాకు స్వర్గభోగములు కలుగునట్లు, రాజాధిరాజులందరూ తనకు సామంతులై సేవ చేసేటట్లు ఎప్పుడు నిన్ను ప్రార్థించినా నీవు దర్శనమిచ్చునట్లు తనకు చావు లేకుండునట్లు, తాను ఏ విధముగా ఏమి తలంచినా అది అయేటట్లు-పెక్కు హిరణ్యాక్షవరాలు కోరాడు. కాళికామాత అతని దురాశకు కోపగించింది. కానీ, ఆ సన్యాసి తనను తపస్సుచేసి మెప్పించాడు, కాబట్టి ఆమె బాగా ఆలోచించి యిలా చెప్పింది ఆ భద్రకాళి.

"ఓయీ! నీవు కోరినట్లు యిచ్చుటకు నాకు సమ్మతమే. కానీ, అందుకు ముందు నీవు భేతాళుని వశము చేసికోవలెను. యిక్కడకు ఆమడ దూరమున గల అడవిలో ఒక పెద్ద మఱ్ఱివృక్షము ఉన్నది. దానిపై రాక్షసగణం భూతప్రేతాదులు నివసిస్తూ ఉన్నాయి. వానికి అధిపతిగా భేతాళుడు ఉంటుంటాడు. అతడు ఒక

శవాకారముగా ఆ మఱ్ఱికొమ్మకు వ్రేలాడుతూ ఉంటాడు అతనిని నీవు ముందు వశం చేసుకోవాలి.

అంతకంటే ముందుగా నీవు నాకు సంతుష్టికలిగించు. భద్రకాళీ హోమము చేయాలి. నా నామము పఠించుచు ఆ హోమము చేయాలి. నరబలి ఉండాలి. నూరుమంది రాజకుమారులుగా ఉండాలివారు. ఆఖరివాడు అనగా నూరవ రాజకుమారుడు మహావీరుడు. సాహసముగలవాడై యుండాలి. ఆ నూరవబలితో యజ్ఞము (హోమం)పూర్తి అవుతుంది. వాని సహాయంతోనే నీవు భేతాళుని వశం చేసికోవాలి. అప్పుడు నీవు కోరిన కోరికలు అన్నియు తీరుతాయి" అని చెప్పి మాయమైంది.

భద్రకాళి మాట చొప్పున ఆ దురాశాపూరితుడైన సన్యాసి హోమము ప్రారంభించాడు. హోమానికి రాజకుమారునిబలి అవసరంగదా! అందుకు దేశదేశ ములు తిరిగి—మాయమాటలతో రాజకుమారులను భద్రకాళి ఆలయమునకు తీసి కొనివచ్చి, వారిని నమ్మించి, దేవికి మ్రొక్కునట్లు చేసేవాడు. ఆయా రాజకుమారు లట్లు మ్రొక్కే సమయంలో ఖండిస్తూ ఉండేవాడు.

ఈ విధంగా ఆ సన్యాసి 99 మంది రాజపుత్రులను నమ్మించి తీసికొని వచ్చి భద్రకాళికి బలి చేసాడు. ఇక నూరవవాడు రావాలి. ఆ రాజకుమారుడు మహావీరుడు, సాహసం గలవాడు. అయిఉండాలి అని గదా భద్రకాళి చెప్పినది!

అందువలన అటువంటి వానికై వెదకుచున్న సమయంలో, ఆ సన్యా సికి విక్రమార్కుని గురించి తెలిసింది. నెమ్మదిగా ఉజ్జయినీ నగరం వచ్చి మకాం చేశాడు. విక్రమార్కుడు దేశసంచారం చేసి రాజ్యానికి వచ్చినప్పుడు ఆయనను దర్శించి యిలా తన కోరిక విన్నవించుకున్నాడు.

# విక్రమార్కుడు సన్యాసితో బయలుదేరుట

"మహారాజా! దేశసౌభాగ్యానికి నేనొక మహాయజ్ఞాన్ని చేయుటకు సంకల్పించుకొన్నాను. అందుకు కావలసినవన్నీ సేకరించుకొన్నాను. ఇచ్చటకు పది క్రోశుల దూరంనందే ఆ హోమగుండం ఉన్నది. ఆ ప్రదేశం మిక్కిలి భయంకరమైనది. నాకు సహాయంగా నీవు నిలవాలి. పూర్వం విశ్వామిత్రునకు రాముడు నిల్చి యజ్ఞం పూర్తి చేయించినాడు. ఇప్పుడు నీవు నిల్చి ఆ యజ్ఞం పూర్తి చేయించుము. దేశసౌభాగ్యమునకు సహాయపడుము" అని ప్రార్థించినాడు.

మహాసాహసవంతుడగు విక్రమార్కుడు ఆతని మాటలకు సమ్మతించి నాడు. "మహాత్మా! దేశసౌభాగ్యానికి నా ప్రాణములనైన ధారపోయగలను. అట్టి నేను మీకు సహాయముగా ఉండలేనా?" అని బదులుచెప్పి-తన వీరఖడ్గంను ధరించి సన్యాసి వెంట బయలుదేరినాడు; భట్టికి రాజ్యభార మప్పగించినాడు.

సన్యాసి విక్రమార్కునితో భద్రకాళీ ఆశ్రయంనకు చేరుకొన్నాడు. విక్రమార్కుడు ఆ తల్లిని మనసారా మదిలోనే ప్రార్థించుకొన్నాడు. సన్యాసి యిలా చెప్పాడు.

"మహారాజా! ఇక్కడకు ఆమడ దూరంలోగల అడవిలో ఒక పెద్ద మఱ్ఱివృక్షం ఉంది. అది భూతప్రేతంలకు నిలయం. దానికి గల ఒక కొమ్మను ఆశ్రయించి భేతాళుడు శవాకారంగా వ్రేలాడుతూ ఉంటాడు. నీవు ధైర్యవంతుడవు. సాహసివి. కావున నీవు భయపడక వెళ్ళి ఆ భేతాళుని (శవాకారమును) తీసికొని రావాలి. అదే మనం చేయబోవుతున్న హోమానికి ముఖ్యంగా కావలసినది" అని బోధించి పంపినాడు. మహారాజు ధైర్యంగా వెళ్ళినాడు. క్రమంగా భేతాళుడున్న ఆ మఱ్ఱివృక్షం చేరుకొన్నాడు విక్రమార్కుడు. భూతప్రేతములు మహారాజును

అనేక విధముల భయపెట్టినవిగాని, వాని మాయలన్నియు మహారాజుముందు మాయమై పోయాయి.

విక్రమార్కుడు భూతముల నోడించి-వెంటనే చెట్టునెక్కి భేతాళ శవాన్ని భుజంపై వేసికొని సన్యాసి ఆశ్రమానికి బయలుదేరాడు. శవాకారంలో ఉన్న భేతాళుడు మహారాజు సాహసానికి ఎంతో మురిసిపోయాడు. "మహారాజా! మనం ఆమడ దూరం వెళ్ళాలి. నీకు శ్రమ లేకుండా ఒక కథ చెబుతాను. ఆల కించి నా సందేహాన్ని నివారించు. నీకు తెలియకపోతే సమాధానం ఇవ్వనక్కర లేదుగాని, తెలిసి, సమాధాన మీయకపోతే నీ తల పగిలి నూరుచెక్కలవుతుంది. ఇది సత్యం-అని యీ విధంగా కథ ప్రారంభించాడు.

# సదానందుని కథ

పూర్వం చంద్రకూటమను నగరమును వీరవర్మ అను మహారాజు పాలించుచుండెను. ఆతని భార్య మణిమాల. వారు ఒకనాడు వివాహం చూచుటకు బంధువుల నగరంనకు వెళ్ళిరి. వివాహపు ముచ్చటలు అన్నియు ముగిసినవి. తిరిగి వీరవర్మ-మణిమాల తమ నగరంనకు బయలుదేరిరి. వారు బయలుదేరిన శకటం అర్ధరాత్రమునకు ఒక అడవి మధ్యభాగంనకు వచ్చినది. ఆ అడవి దాటినచో వారినగరం వచ్చును. కానీ, ఆ కటిక చీకటిలో బయలుదేరుటకు వారు శంకించి, ఆ రాత్రి అక్కడ గడిపి-వేకువజాముననే నగరం చేరుటకు నిశ్చ యించుకొన్నారు.

ఒక పెద్ద మర్రివృక్షం క్రింద రథం ఆపించినారు. శకటచోదకుడు (సారథి) కొంచెం దూరంలో పడుకొన్నాడు. దంపతులిద్దరూ ఆ చెట్టుక్రిందనే పవళించినారు.

ఆ దంపతులు నివసించిన మఱ్ఱివృక్షంపై ఒక రాక్షసుడు నివసించి యుండెను. వాడు రాజదంపతులు అక్కడ పవళించుట చూచి, సహించలేక పోయాడు.

"ఓరీ! నా నివాసము క్రింద భార్యతో సల్లాపాలు ఆడుతున్నావా? మూర్ఖా! చూడు మీ యిద్దరినే యిప్పుడే యమాలయానికి పంపిస్తానని మీదికి రాబోయాడు.

రాజదంపతులు భయపడుచు "తెలియక మేమీ వృక్షము క్రింద పరున్నాము. ఉదయమే లేచి వెళ్ళిపోగలము" అని ప్రార్థించారు.

## రాక్షసుని కోరిక

రాక్షసుడు యిలా అన్నాడు. "తెలిసినా, తెలియకపోయినా నా నివాసాన్ని అపవిత్రము చేశారు. ఇందుకు మీరు నాకు నరబలి యివ్వాలి. అదీ ఎనిమిదేండ్లు నిండిన బాలుని బలియివ్వాలి. అట్లా చేస్తామని మీరు వాగ్దానము చేస్తే మిమ్ము విడిచిపెడతా, లేదా యిప్పుడే మిమ్ము హతమారుస్తా"నని హూంకరించాడు.

రాజదంపతులు వాగ్దానం చేశారు. రాక్షసుడు శాంతించాడు- రాజదంపతులు వేకువజాముననే లేచి బయలుదేరి తమ నగరం చేరుకొన్నారు.

రాజు తలచిన దెబ్బలకు కొరతా! అన్నట్లు ఒకపేద బ్రాహ్మణునికి బంగారం, ఒక గ్రామం ఆశచూపి, వారి కుమారుని పదేండ్లవానిని సంపాదించారు.

ఆ మరునాడే రాజదంపతులు బాలునితో రాక్షసుడు ఉన్న చెట్టువద్దకు

వచ్చారు. ఆ బ్రాహ్మణుని కుమారునిపేరు సదానందుడు. ఆఖరు కోరిక ఏమిటని రాజు ఆ బాలుని ప్రశ్నించాడు. ఆ బాలుడు మాటాడక ఆకాశంవైపు చూస్తూ పకపక నవ్వ నారంభించాడు. ఆ నవ్వుతో రాక్షసుని మనస్సు మారిపోయింది. "బలి అవసరం లేదు. మీరు హాయిగా వెళ్ళండి!" అని వెళ్ళిపోయాడు.

మహారాజా! విన్నావుకదా కథ! ఆ బాలుడు ఎందుకు నవ్వెనో చెప్ప గలవా? అని భేతాళుడు అని ప్రశ్నించెను. విక్రమార్కుడు ఆలోచించి "బుద్బుద ప్రాయమైన శరీరంపై వీరందరకూ ఎంత మమకారం! ఏనాటికైనా వీరుకూడ చచ్చేవారేకదా! అని వారి తెలివి లేమికి, భగవంతుని తలచుకొని నవ్వినాడు ఆ బాలుడు" అన్నాడు.

మౌనభంగం కావడంతో భేతాళుడు ఎరిగి తన వృక్షానికి చేరుకొన్నాడు.

భేతాళుడు తన పట్టునుండి తప్పించుకొని, మరల చెట్టునకు అతుకు కొని పోయినందుకు విక్రమార్కుడు విసిగి కొనలేదు. తిరిగి చెట్టువద్దకు వెళ్ళి, భేతాళుని బంధించినాడు; భుజముపై వేసికొని ఆశ్రమానికి బయలుదేరినాడు; విక్రమార్కుడు.

భేతాళుడు ఊరుకొనలేదు. ఆతడు విక్రమార్కుని జూచి "మహీపాలా! నాకు చాలా కాలమునుండి ఒక సందేహము ఉన్నది. ఆ సందియమును తెలియ జేయుదును. నీవు సకల నీతి పారంగతుడవు. కావున నా అనుమానమును దీర్చుము" అని పలికి యిట్లు పలుకసాగెను.

## సత్యవ్రతుని కథ

పూర్వకాలంలో కళింగ పట్టణమున సత్యవ్రతుడను ఒక రైతుండెను.

అతనికి "నా" అను వారెవ్వరూ లేరు. ఆతనికి కొద్దిగా పొలం ఉండెను. దానిని తానే స్వయముగా సేద్యము చేసికొనుచు, దానిమీద వచ్చు రాబడితో జీవించేవాడు.

సత్యవ్రతునికి తల్లిదండ్రులు లేని కారణము వలనను, పట్టించుకొని చేసే పెద్దవారు (బంధువులు) ఎవ్వరూ లేనందువల్ల ఆతనికి వివాహము కాలేదు. అందరివలె తానుకూడ పెండ్లి చేసుకొని సంసారము చేయవలె"నను కోరిక ఉంది సత్యవ్రతునికి.

కానీ, ఒంటరివాడగు ఆతనికి కన్యనిచ్చుటకు ఆ గ్రామము రైతులెవ్వరూ సమ్మతింపలేదు. అందువలన సత్యవ్రతుని కోరిక తీరలేదు. ఆ కోరిక తీరుటకై ఆలోచనలు చేస్తుండేవాడు.

కొన్ని రోజుల్లట్లే గతించిన. ఆ సంవత్సరం తన గ్రామానికి పొరుగున ఉన్న "షిష్టలాపురము"లో అమ్మవారి జాతర జరిగెను. సత్యవ్రతుడు ఆ కాళికా మాత ఉత్సవము చూచుటకు వెళ్ళెను. ప్రతి సంవత్సరమూ అతడు వెళ్ళు చుండెడివాడు.

ఆ జాతర చూచు సంధర్భములో, ఒక దగ్గర సత్యవ్రతునికి ఒక కన్యక కనిపించింది. ఆమె రూపం సత్యవ్రతునికి చాల ఆనందం కలిగించింది. ఆ కన్యక గూడ సత్యవ్రతుని చూచి ఎంతగానో ఆనందించింది. అది పసిగట్టాడు సత్యవ్రతుడు. వారికి తెలియకుండ వారిని వెంబడించి, వారి బసను తెలిసికొన్నారు.

అదే రాత్రి సత్యవ్రతుడు కాళీమాత ఆలయంలోనికి వెళ్ళి దేవినిగాంచి యిలా ప్రార్థించాడు. "అమ్మా! నేను యెవ్వరూలేని నిర్భాగ్యుడను. నీవు తల్లీవి. నీవే నన్ను కరుణించాలి. ఈ రోజున నేను జాతకంలో చూచిన కన్యకను నాకు

భార్యగా ప్రసాదించుము. నాకు గల కోరిక తీరుతుంది. ఇందుకు భక్తితో - నా కోరిక తీర్చిన నీకు—నా శిరస్సునే కానుకగా యిస్తాను" అని మ్రొక్కుకున్నాడు.

ఆ మరునాడు తన స్నేహితులను కొంతమందిని ఆ కన్యక తండ్రి వద్దకు పంపించి-"మా సత్యవ్రతునికి మీ అమ్మాయిని భార్యగా చేయు"డని అడిగించెను. దేవీ మహిమవలన, ఆ తండ్రి తన కూతురగు "సుశీల"ను యిచ్చుటకు సమ్మతించెను. సుశీలా సత్యవ్రతుల వివాహం చాల వైభవంగా జరిగింది.

వివాహానంతరం సత్యవ్రతుడు "మనుగుడుపు వేడుకకై అత్తవారింటికి వచ్చాడు. అక్కడ కొన్ని రోజులు ఉండాలి. కాబట్టి ఉన్నాడు. ఒకనాడు సుశీల అన్నగారగు "వీరధవళునితో సత్యవ్రతుడు విహారము సేయుచు క్రమముగా కాళికామాత ఆలయ సమీపమునకు చేరుకున్నాడు.

## సత్యవంతుడు తన వాగ్దానం నిలుపుకొనుట

దేవాలయము చూడగనే సత్యవ్రతునికి-తాను దేవికి ఒసగిన వాగ్దానము జ్ఞాపకము వచ్చినది. "అయ్యో! ఎంత అపచారము! పెండ్లి అయి నెల రోజులు కావచ్చుచున్నది. విషయలోలుడనై దేవి కిచ్చిన మాట మరచిపోయాను. ఎంత అపచారం జరిగింది!" అని మనస్సులో తలంచి, వీరధవళుని జూచి "బావా! ఇక్కడనే ఉండుము. దేవిని దర్శించి వత్తును" అని పలికి గుడిలోనికి వెళ్ళెను. వీరధవళుడు అక్కడనే ఆతనిరాకకు ఎదురుచూడసాగెను.

అరగంట కాలము గడచినది. కానీ, సత్యవ్రతుడు గుడిలోపలనుండి తిరిగి రాలేదు. అందువలన వీరధవళుడు "బావ యింతసేపు ఏమి చేయుచున్నాడు" అని తలంచుచు తాను. కూడ ఆలయంలోనికి వెళ్ళాడు.

గుడిలోనికి పోయిన వీరధవళుడు అక్కడి దృశ్యమునుగాంచి నిర్ఘాంత

పోయినాడు. దేవి విగ్రహం ముందు సత్యవ్రతుడు శిరస్సు ఖండించుకొని పడి యున్నాడు. నెత్తురు కాల్వగట్టి పారుతూ ఉంది.

"అయ్యో! ఇదేమి గ్రహచారము! ఎందుకై యితడు తన శిరస్సును దేవికి కానుక యిచ్చెను? ఈతని మరణం గురించి ఇంటిలో ఎలా చెప్పగలను? చెప్పిన వారు నమ్మెదురా? చెల్లెలి వైధవ్యము చూస్తూ నేను జీవించగలనా? ఛీ ఛీ! ఇంత కన్న మరణించుట మేలుగదా!" అని నిశ్చయించుకొని వీరధవళుడు దేవిముందు గల ఖడ్గముతో శిరస్సు ఖండించుకొనెను.

ఈ సంగతి తెల్లవారునప్పటికి అందరికీ తెలిసింది. సుశీల, ఆమె తలి దండ్రులు, బంధువులు వచ్చారు. చూచి ఘొల్లుఘొల్లున దుఃఖించసాగారు.

"పతిలేని సతికి యింకెక్కడి గతి" యని సుశీల గూడ మరణించుటకై కత్తి నెత్తెను. అంత దేవీ గ్రహమునుండి "బాలా! తొందరపడకుము. నీ సాధ్వీ గుణమునకు మెచ్చితిని. నీ పతిని, నీ అన్నను నేను బ్రతికింతును. వినుము; నా విగ్రహం ముందుగల కలశంలోని జలమును వారిపై చల్లుము" అను మాటలు వినబడెను.

సుశీల వెంటనే దేవికి నమస్కరించి తెగి పడియున్న శిరస్సులను దగ్గరకు చేర్చి, దేవి ఆనతిచొప్పున జలమును జల్లెను. సత్యవ్రతుడు, వీరధవళుడు నిద్ర నుండి లేచినట్లు లేచేరి.

అందరూ ఆనందంతో యింటికి వెళ్ళిపోయిరి.

ఈ విధంగా కథ చెప్పిన భేతాళుడు "మహారాజా! కథ వింటివిగదా! ఇందులో ఎవరు చేసిన త్యాగం గొప్పది?" అని ప్రశ్నించాడు.

విక్రమార్కుడు ఆలోచించి "భేతాళా! సత్యవ్రతుడు తన వాగ్దానం

నిల్పుకొన్నాడు. సుశీల-"పతి లేని బ్రతు కెందుకు" అని మరణించుటకు పూను కొన్నది. కాని, వీరధవళుడు చేసిన త్యాగం చాల విలువ గలది. త్యాగమునకు వన్నె తెచ్చినది ఆతని సుగుణము" అని జవాబు నిచ్చాడు.

వెంటనే భేతాళుడు నియమభంగ మగుటచే తుర్రున ఎగిరి మరల చెట్టునకు అంటుకున్నాడు. విక్రమార్కుడు విసుగుచెందలేదు. మరల భేతాళుని బంధించి తెచ్చుటకై చెట్టుదిక్కును బయలుదేరాడు.

వీర విక్రమ ప్రతాపవంతుడైన విక్రమార్క భూపాలుడు, తిరిగి భేతాళుని బంధించి ఆశ్రమానికి బయలుదేరాడు. కానీ, భేతాళుడు మరల ఆతని పరీక్షింపగోరి యిట్లా అన్నాడు.

"విజ్ఞాననిధివైన విక్రమాంక భూపాలా! నీ రాకవలన, నా యనుమానంలన్నియు తీరుచున్నవి. మరొక్క సందేహం వివరింతును. దానిని విని నా సందేహంను దీర్పుము" అని మరొక్క కథ చెప్పసాగెను.

## ప్రతాపసేనుని కథ

పూర్వకాలంలో మగధ భూపాలునికి ఒక అంగరక్షకుడు ఉండేవాడు. అతనిపేరు ప్రతాపసేనుడు. పేరునకు తగిన ప్రతాపం గలవాడు. అంతకు మించిన స్వామిభక్తి గలవాడు.

ఒకనాటి రాత్రి ప్రతాపసేనుడు ప్రభుకొలువునుండి, తన గృహంనకు బయలుదేరాడు. అప్పటికి అర్ధరాత్రి అయింది. చీకట్లు నలుమూలలా దట్టంగా అల్లుకొన్నాయి. అట్టి చీకటిలో ధీరుడైన ప్రతాపసేనుడు యింటికి ఒంటరిగా వస్తున్నాడు.

ఆ సమయంలో ఒక స్త్రీ రత్నం దుఃఖించుచు పోవుచున్నట్లు అతనికి

గోచరించినది. ఆమె దుఃఖకారణం తెలిసికొనుటకై ప్రతాపుడు ఆమెను వెంబడించెను. కానీ, తాను ఎంత త్వరగా నడచిననూ ఆమెను కలిసికోలేక పోయాడు.

కొంతసేపటికి ఆ స్త్రీ రత్నం ఊరిచివరనున్న దుర్గాలయంలోనికి ప్రవేశించింది. ప్రతాపుడును లోనికి ప్రవేశించెను. ఆ స్త్రీ కొరకు లోపల వెదకెను. కాని, ఆమె కనిపించలేదు. అందువలన "ఆ స్త్రీమూర్తి దుర్గాదేవియే అయి ఉండవచ్చునని" ప్రతాపసేనుడు తలంచే "అమ్మా! నీవు యీ నగరసంరక్షకురాలవు. తల్లీ! నీకు వచ్చిన ఆపదయేమి? దయయుంచి తెలియజేయుమమ్మా" అని వేడుకొన్నాడు.

అప్పుడు దేవీవిగ్రహంనుండి యిట్లు వినబడెను. "ప్రతాపా! నాకు ఏ ఆపదయు రాలేదు. మీ మహారాజునకే రేపటితో అయువు తీరుచున్నది. అతని అకాల మరణంనకే దుఃఖించుచున్నాను" అని.

ప్రతాపుడు చేతులు జోడించి "అమ్మా! ఆ యకాలమరణం నుండి ప్రభువును రక్షించు మార్గమున్న తెలియజేయుము. నా ప్రాణముల నిచ్చియైన మహారాజును కాపాడుకొందును" అని పలికెను.

"మార్గమున్నది, వినుము. స్వామిభక్తిగలవాడు తన కుమారుని నగరదేవతనగు నాకు బలి యిచ్చిన, మహారాజునకు గండం తప్పును" అనెను దుర్గాదేవి.

## ప్రతాపసేనుని రాజభక్తి

ప్రతాపుడు చాల ఆనందించెను. అతనికి పండ్రెండేండ్ల కుమారుడు ఉండెను. అతనిని బలిచేసి ప్రభువును రక్షించుకొనవలెనని నిశ్చయించుకొని వెంటనే గృహంనకు వెళ్ళెను. ప్రతాపుని భార్యకూడ పతిగుణములకు తీసిపోవునది కాదు.

ప్రతాపుడు గుడినుండి వచ్చి, తనగృహంలోనికి పోవుట, నగర పాలకులగు గూఢచారులు గమనించిరి. గృహంనకుగల కిటికీలనుండి చూచిరి. లోపల ప్రతాపుడు భార్యతో గుసగుస లాడడం, మధ్య మధ్య "మహారాజు" శబ్దం రావడంవల్ల, వారికి అనుమానం కలిగింది. వారిలో ఒకడు మహారాజునకు ఆ విషయం తెల్పుటకు వెళ్ళాడు. ఇంకొకడు ముందు ఏమి జరుగునో చూచుటకు ఆ ప్రాంతమందే దాగుకొని యున్నాడు.

లోనికిపోయిన ప్రతాపుడు జరిగినసంగతి అంతయూ భార్యకు తెలియ జేశాడు." ఇప్పుడు మనం ప్రభువును రక్షించుకోవాలి. మన పుత్రునికంటె దేశమునకు మహారాజు ముఖ్యము" కావున మనపుత్రుని దేవికి కానుకగా యిద్దాము; ప్రభువును కాపాడుకుందాము" అని పలికెను.

భర్త మాటలకు ఆమె మనస్సులో కుమారునికై బాధపడెను. కానీ, ఆ బాధ పైకి కనబడనీయక "అంతకంటె మనకు కావలసినదేమున్నది? అట్లే చేయుదము. రాజు బాగుండిన రాజ్యం బాగుపడును" అని సమ్మతించెను. ప్రతాపుడు ఆమె మాటలకు మిక్కిలి ఆనందించెను.

ఆ దంపతులు వెంటనే నిద్రపోవుచున్న కుమారుని లేపి, తమ నిర్ణయంను తెలియజేసిరి. కుమారుడుకూడ ఆనందంతో అంగీకరించెను. "మనము ఎవరి ఉప్పు తిని జీవించుచున్నామో, అట్టివారికొరకు, అందుకు జగన్మాతయగు దుర్గాదేవికి నా శరీరం నిచ్చుట ఎంత అదృష్టము!" అని పుత్రుడు నిర్మలమనసుతో తన సమ్మతి తెలియజేశాడు.

ప్రతాపుడు ఆనందంతో అప్పుడే కుమారుని వెంటబెట్టుకొని దుర్గాలయమునకు బయలుదేరినాడు. వారివెంట ప్రతాపుని భార్యయు నుండెను.

వీరు బయలుదేరిన రెండునిమిషములకే మహారాజుకూడ అక్కడకువచ్చెను. అక్కడ ఉన్న గూఢచారి "మహారాజా! ప్రతాపసేనుడు యిప్పుడే తన భార్య పుత్రులతో యిటు వెళ్ళినాడు" అని తెలియజేశాడు. మహారాజు వెంటనే ప్రతాప సేనుడు వెళ్ళిన మార్గమున బయలుదేరెను.

ప్రతాపసేనుడు తిన్నగా భార్యాపుత్రులతో దుర్గాలయంనను వెళ్ళాడు. మహారాజుకూడ ఆలయమున ప్రవేశించి "వారేమి చేయుదురో చూచుటకై రహస్యంగా పొంచుండి వీక్షింపసాగాడు.

ప్రతాపసేనుడు దేవిని పూజించి, పుత్రునికి తిలకం (బొట్టు) పెట్టి "అమ్మా! ఈ బాలుడు నా పుత్రుడు. దీనిని మనస్ఫూర్తిగా నీకు సమర్పించు చుంటిని. వీనిని స్వీకరించి, మా ప్రభువును అకాల మరణంనుండి తప్పింపుము. ఆతనివంశం నుద్ధరింపుము" అని పలుకుచు ఖడ్గముతో కుమారుని మెడ ఖండించెను.

పుత్రుని మరణం కండ్లారజూచిన తల్లి హృదయం ఆ దారుణ దృశ్యానికి తట్టుకోలేకపోయింది. వెంటనే భర్తచేతిలో నున్న ఖడ్గంను తీసుకొని పొడుచుకొని మరణించినది.

ప్రతాపునికి భార్యమరణంతో జీవితముమీద విరక్తి పుట్టినది. "అమ్మా! మా జీవితము లేమైనను, ప్రభువును కాపాడుము. నీ మాటను నిలబెట్టుకొమ్మ" అని పల్కుచు తాను కూడ కైజారుతో పొడుచుకొని మరణించెను. క్షణాలమీద వారు ముప్వురూ దేవికి బలిఐపోయిరి.

మహారాజు అదృశ్యమంతయు తిలకించి "ఆహా! స్వామిభక్తి పరు డగు ప్రతాపుని వంటివాడు నాకిక లభ్యమగునా? నాకై త్యాగము చేసిన ఈ మహా వీరుని ఋణము నేనెట్లు తీర్చుకొందును! ఇట్టి ప్రభుభక్తి పరాయణుని విడిచి జీవించుటకంటే హీనం ఇంకొకటుందా?" అని తలంచుచు తానుకూడ మరణించు టకై కత్తినెత్తెను.

అంతట దుర్గాదేవి ప్రత్యక్షమై "మహారాజా! తొందరపడకు. మీ యిరువురికీ బాడారులపైగల భక్తి విశ్వాసముల గమనించుటకు నేనీ నాటక మాడాను. నా పరీక్షలో మీరిర్వురూ విజయం పొందినారు". అని పలుకుచు ప్రతాపుని ఆతని భార్యను కుమారుని బ్రతికించి, వారికి పెక్కువరము లిచ్చి పంపివేసినది.

"భేతాళుడిట్లు కథ చెప్పి "విక్రమార్క భూపాలా! వింటివి గదా కథ? ఇందు త్యాగమూర్తి ఎవరు?" అని ప్రశ్నించెను.

విక్రమార్కుడు ఆలోచించి "భేతాళా! ప్రతాపసేనుడు తన ప్రభు సంరక్షణకై పూనుకొన్నాడు. భార్యాపుత్రుల మరణముతో విరక్తి చెంది మరణించాడు. భార్య పుత్రుని మరణము భరింపలేక మరణించినది. తల్లిదండ్రుల మాట తీసివేయలేక బలియైనాడు. కానీ, మహారాజు తనకై త్యాగము చేసిన ప్రతాపుని కుటుంబమును గమనించి-నిజమైన త్యాగము చేసినాడు. కావున మహారాజునే త్యాగమూర్తి అని చెప్పాలి" అని బదులు పలికాడు.

నియమభంగమైంది; భేతాళుడు విక్రమార్కుని పట్టునుండి యెగిరి చెట్టు పైకి చేరుకున్నాడు. విక్రమార్కుడు తిరిగి భేతాళుని కొరకై వెనుకకు మళ్ళినాడు. విక్రమార్కుడు మరల భేతాళుని బంధించి, భుజముపై నిడుకొని ముందుకు బయలుదేరాడు. తిరిగి భేతాళుడిట్లు చెప్పసాగాడు.

## పుండరీకుని కథ

"విక్రమార్క భూపాలా! పూర్వము కాశీనగరమును వేదవర్మ అను మహారాజు పాలించెడివాడు. అతని ఏకైకపుత్రిక- తిలోత్తమ. ఆమె అందాల రాశియై, విజ్ఞానవతియై, వినయవతియై ప్రకాశించినది.

ఆ రాజపుత్రికను పెండ్లాడుటకు మంత్రికుమారుడగు పుండరీకుడు; సేనాధిపతి కుమారుడు-అగు వీరవర్మ; కోశాధికారి కుమారుడగు ధనపాలుడు-ఈ

మువ్వురను ప్రయత్నింపసాగిరి. వారు ముగ్గురుకూడ విజ్ఞానవంతులే; పరాక్రమము గలవారలే; సుందరాకారులే.

అందువలన మహారాజగు దేవవర్మ బాగా ఆలోచించాడు. ఆ మువ్వురను సభలోనికి పిలిపించి యిట్లు తెలియజేశాడు. "మీలో ఎవ్వరు మంచి మహత్తుగల వస్తువులను సంపాదించుకొని వత్తురో, అట్టివారికి నా పుత్రిక తిలోత్తమను యిచ్చి వివాహము చేయుదును" అని సభాసదుల యెదుట తెలియజేసెను.

పుండరీకుడు, వీరవర్మ, ధనపాలుడు—ఈ మువ్వురూ మహారాజు మాటలకు సమ్మతించిరి; వెంటనే వారు మువ్వురూ మూడుమార్గములు బట్టి బయలుదేరిరి.

ఇట్లు బయలుదేరిన ఆ వీరులు ముగ్గురూ ఆరు మాసముల నాటికి మగధ దేశములో కలిసికొన్నారు. ఆనందంతో ఆరోజు గడిపినారు. ఆ సమయంలో పుండరీకుడు "రాజపుత్రిక యిప్పుడు ఏమిచేయుచుండెనో! చూడాలని ఉంది" అని తన కోరిక చెప్పినాడు.

అంత ధనపాలుడు "రాజపుత్రికను చూడవలయునన్న నేను చూపించ గలను. అట్టి అద్భుతమైన వస్తువు నావద్ద నున్నది" అనెను. మిత్రులిద్దరూ చూచుటకు ఉత్సాహం చూపించారు.

"ధనపాలుడు వెంటనే తాను భద్రముగా గొనివచ్చిన ఒక అద్దమును పైకి తీసెను. లోలోపల ఒకమంత్రమును పఠించి"కాశీనగరం-అంతఃపురంయందలి తిలోత్తమ గది" అన్నారు. ఆశ్చర్యం! నిజంగా ఆ అద్దములో కాశీనగరమంతా కనిపించసాగింది. క్రమంగా అంతఃపురమందలి తిలోత్తమగది కనిపించింది. అందులో అందరూ ఏడ్చుచున్న దృశ్యమూ, కొంచెం దూరంలో తిలోత్తమ శవమూ కనిపించింది.

పుండరీకుడు ఆ దృశ్యాన్ని చూచి "అయ్యో! తిలోత్తమ మరణించింది. త్వరగా అక్కడకు వెడితే బాగుండును. నేనామెను బ్రతికించగలను? నేనట్టి మంత్రమును సంపాదించాను. అని కంగారు పడసాగెను.

అప్పుడు వీరవర్మ లేచి-"నేను తీసికొనిపోగలను. అట్టి మహిమ గల వస్తువు నావద్ద నున్నది" అని పలుకుచు ఒక కంబళి (తివాచీ) తీచి పరచినాడు. ముగ్గురూ దానిపై కూర్చుండి, వాయువేగంతో వచ్చి తిలోత్తమ గదిముందు దిగానారు.

పుండరీకుడు వెంటనే తిలోత్తమ శవమువద్దకు వెళ్లి, తాను సంపాదించిన మహత్తరమైన దివ్యమంత్రముతో తిలోత్తమను బ్రతికించినాడుఅందరును చాల సంతోషించినారు."

విక్రమార్క-భూపాలా! వింటివికదా కథ? ముగ్గురూ వీరులు గొప్ప మహిమగల వస్తువులు సంపాదించినవారే! మహారాజగు వేదవర్మ యిప్పుడు తన పుత్రిక తిలోత్తమను ఎవరికిచ్చి వివాహం చేయాలి?" అని భేతాళుడు ప్రశ్నించెను.

విక్రమార్కుడు క్షణం యోచించి "భేతాళా! నీవు చెప్పినట్లు ముగ్గురు గొప్ప మహత్తుగలవి సంపాదించినవారే. అయినను ప్రాణ మొసగినవాడు పుండరీకుడు. మిగిలినవారు యిద్దరూ అతనికి సహాయపడినారు. అంతియేగాక, మగధ రాజ్యంలో వారు కలిసికొన్నప్పుడు తిలోత్తమను చూడ నభిలషించినవాడును పుండరీకుడే. కావున తిలోత్తమ పుండరీకునకే భార్యయగుట ధర్మమా" అని జవాబు నిచ్చెను.

"అవును. మహారాజు తిలోత్తమా—పుండరీకులకే వివాహము చేయించినాడు."

అని పలుకుచూ, నియమభంగ మైనందున, ఎగిరి చెట్టునకు వ్రేలాడి నాడు. విక్రమార్కుడు మరల ఆ చెట్టువైపు బయలుదేరినాడు.

విక్రమార్కుడు మరల చెట్టువద్దకు వెళ్ళి, భేతాళుని బంధించి భుజంపై వేసికొని బయలుదేరాడు. భేతాళుడు ఇంకొక కథ ప్రారంభించాడు.

## విజ్ఞాన హీనుల కథ

"విక్రమార్క భూపాలా! గమనాయాసం కల్గకుండా నీకు ఒక కథ చెబుతాను. పూర్వం అవంతీపట్టణాన్ని అనుకొని "సుధామపురం" అను ఒక అగ్రహారం ఉండేది. ఆ అగ్రహారంలో అగ్నిదత్తుడనే పండితుడు ఉండేవాడు. అతడు అనేకమైన మంత్ర తంత్రములలో ప్రవీణుడు. అగ్నిదత్తునికి నల్గురు కుమారులుండిరి. వారు తండ్రివద్దనే అన్ని విద్యలూ నేర్చుకొన్నారు. కానీ. వారికి లోకజ్ఞానం ఇంచుకంతయూడా లేదు.

అగ్నిదత్తుడు బాగా ముసలివాడైనాడు. అవసానదశ సమీపించినది. అందువలన అతడు తన నల్గురికుమారులను పిలిచి, వారికి అమూల్యములు, అపూర్వములైన మంత్రములను-నల్గురికీ నాల్గుమంత్రములు ఉపదేశించినాడు. కాలము తీరుటచే మరణించినాడు.

పుత్రులు నల్గురూ తండ్రికి జరుపవలసిన పితృకర్మలు ముగించారు. తరువాత వారు తమకు తండ్రిబోధించిన మంత్రములద్వారా డబ్బు సంపాదించుటకు అవంతీనగరానికి బయలుదేరారు.

సుధామపురానికి, అవంతీనగరానికి మధ్య ఒక అడవి ఉంది. ఆ అడవి

దాటితే అవంతీనగరం చేరవచ్చు. క్రమముగా వారు నల్వురూ సుధామపురం దాటి అడవిలోకి వచ్చారు. అప్పుడు వారిలో పెద్దవానికి ఒక సందేహం వచ్చింది. అదే మనగా "తండ్రి ఉపదేశించిన మంత్రము ఫలిస్తుందా? లేదా?" అనునది.

"ఆ సందేహం తీర్చుకొనిగాని అవంతీనగరానికి పోకూడదు" అని నిశ్చయించుకొని తమ్ముళ్ళకు చెప్పాడు. వారు కూడ అందుకు సమ్మతించారు. పెద్దవాడు ఆ అడవిలో వెదకి, ఒక ఎముకను సంపాదించాడు. దానిని తమ్ముల ముందు ఉంచి, తన మంత్రాన్ని పఠించాడు. వెంటనే ఆ యెముక ఒక అస్థిపంజరంగా తయారయింది. తన మంత్రప్రభావమునకు పెద్దవాడు ఎంతో ఆనందించాడు.

వెంటనే రెండవవాడు ముందుకువచ్చి "నా మంత్రమును గూడ పరీక్షించుకుంటాను" అని పలుకుచు, ఆ అస్థిపంజరముపై తన మంత్రాన్ని ప్రయోగించాడు. వెంటనే ఆ అస్థిపంజరానికి, మాంసము-ప్రేగులు-రక్తము మొదలగునవి ఏర్పడినాయి. తన మంత్రం ఫలించినందుకు అతడుకూడా ఎంతో మురిసిపోయాడు.

మూడవ వాడు కూడా ముందుకు వచ్చాడు తన మంత్రాన్ని పఠించుకోడానికి.

మాంసము, రక్తము, ప్రేగులు వగైరాలు గల ఆ నిర్జీవ కళేబరముపై తన మంత్రమును పఠించినాడు మూడవవాడు. వెంటనే ఆ నిర్జీవ కళేబరానికి— రోమములు, చర్మము, కళ్ళు, గోళ్ళు, కాళ్ళు, చేతులు చర్మం ఏర్పడినాయి. అది యొక సింహము ఆకారం అయింది. ప్రాణం మాత్రము లేదు. తన మంత్ర ప్రభావానికి మూడవవాడు ఉబ్బిపోయి గంతులు వేశాడు.

ఇక ఉన్నవాడు నాల్గవవాడు. వాని మంత్ర ప్రభావమువల్ల దానికి

జీవము వచ్చును. జీవము వచ్చిన ఆ ప్రాణి ఊరుకుంటుందా? అసలే క్రూర జంతువు, లోకజ్ఞానములేని మూర్ఖులు అది ఆలోచించలేదు.

వెంటనే నాల్గవవాడు ఆ నిర్జీవమైన సింహం మీద తన మంత్రాన్ని ప్రయోగించాడు. వెంటనే సింహం అయింది; ఆ జీవం లేని సింహం శరీరం.అది ఊరుకుంటుందా? ఆ నలుగురు బ్రాహ్మణులను పొట్టన బెట్టుకొంది; అడవిలోనికి హాయిగా పరుగెత్తింది.

"మహారాజా! విన్నావుకదా! ఆ నల్వురులలో ఎవరు విజ్ఞానహీనుడు" అని భేతాళుడు ప్రశ్నించాడు.

"విక్రమార్కుడు "భేతాళా! మొదటి ముప్వురు బ్రాహ్మణులు తమతమ మంత్ర మహిమ తెలుసు కోదలచి- ఎముకను సింహంగా తయారుచేశారు. క్రూర జంతు వని సింహమని తెలిసికూడా నాల్గవవాడు తనమంత్ర మహిమను చూడదలచు కొన్నాడు. కావున వారిలో నాల్గవవాడే జ్ఞానహీనుడు" అని బదులు చెప్పాడు.

భేతాళుడు వెంటనే ఎగిరి చెట్టుమీదికి చేరుకొన్నాడు. విక్రమార్కుడు విసుగు జెందక, మరల వృక్షమువైపు బయలుదేరాడు.

విక్రమార్కుడు మరల భేతాళుని భుజముపై వేసుకొని ఆశ్రమానికి బయలుదేరాడు. భేతాళుడు మరల ఇంకొక కథ ప్రారంభించాడు.

## నిర్మలా రాగవల్లుల కథ

పూర్వం మధురానగరాన్ని విక్రమజిత్తు అను రాజు పాలించేవాడు. ఆ మహారాజు పుత్రికపేరు నిర్మల. ఆమె అందాలరాశి. ఆమెను పెండ్లాడగోరి

అనేకమంది రాజపుత్రులు ప్రయత్నించారు. కానీ, నిర్మల వారినందరనూ తృణీకరించింది.

ఒకనాడు నిర్మల తన చెలికత్తెలతో విహరిస్తూ ఉంది; ఉద్యానవనంలో. ఆ ఉద్యానవనంలో అంతఃపుర స్త్రీలు తప్ప ఇతరులు ఎవరూ అందువిహరించుటకువీలు లేదు. మగవారు అసలే పోరాదు.

నిర్మల విహరించే ఆ సమయంలో, ఒక యువకుడు రహస్యంగా చుట్టూ ఉన్న ప్రహరీగోడ దూకివచ్చి ఒక లతాకుంజము మధ్య దాగియుండెను. అతని రాకను రాజపుత్రికగాని, చెలికత్తెలుగాని ఎవరునూగుర్తించలేదు.

కొంతసేపటికి రాజపుత్రిక నిర్మల ఆటలు చాలించి, అందులో గల కొలని గట్టున విశ్రాంతి తీసికొనుచు, విశ్రమించెను. చెలికత్తెలు కొంతదూరంలో గల పూలవృక్షములు చేరి, పూలుకోయుచుండిరి. ఆ సమయంలో ఒంటరిగానున్న రాజపుత్రిక దగ్గరకు చేరాడు లతాకుంజముల మధ్య దాగిన యువకుడు.

ఆ యువకుడు మిక్కిలి అందమైనవాడే. కానీ, రాజపుత్రులు ధరించి విలువైన వస్త్రము లేవీ లేవు. అతడిని చూచి నిర్మల మొదట భయపడినది. కానీ, ఆతని అందచందములకు ముగ్ధురాలై ఆతనిని జూచుచూ లేచి కూర్చున్నది. ఆ యువకుడిలా అన్నాడు.

"రాకుమారీ! నేనొక ధనవంతుని కుమారుడను. రాజపుత్రుడను కాను. మాది కళింగదేశము. నీ అందచందములనుగూర్చి విని సాహసించియిలా వచ్చాను; నీ అభిమతము తేలిసికొని, మీ నాన్నగారితో మాటాడవలయునని." అన్నాడు. రాజపుత్రిక సమ్మతించినది.

ఇంతలో నిర్మల చెలికత్తెలు వచ్చుచున్న సవ్వడి గమనించి- రాగ

మల్లుడు "నిర్మలా! నేను రేపు కలుస్తాను" అని పలుకుచూ, తాను వచ్చినదారినే మాయమైపోయాడు.

రాగమల్లుడు పారిపోవుట యొక చెలికత్తెయు చూచినది. వెంటనేనిర్మల దానిని దగ్గరకు పిలిచి "అల్లరి చేయకు. ఆతడు నాకై వచ్చినాడు. నేనతనిని ప్రేమించాను. అమ్మద్వారా, నాన్నగారికి యీ విషయం చెప్పిస్తాను" అన్నది. తర్వాత వారందరూ అంతఃపురం చేరుకొన్నారు.

ఇంతలో రాజభవనం క్రింద పెద్ద కోలాహలం బయలుదేరింది. అంతః పురం నుండి నిర్మల అటు చూచింది. రాగమల్లుని రాజభటులు బంధించినారు.అందు వలన కోలాహలం బయలుదేరింది.

రాజభవనానికి అనుకొనియే ఉద్యానవనముంది. కావున రాగమల్లుడు గోడదూకి పారిపోవుట గమనించి రాజభటులు ఆతనిని బంధించారు.

మరునాడు రాజదర్బారులో రాగమల్లుని విచారణ జరిగింది. రాగమల్లుని బంధించిన సేనాధిపతి ఆతనిని గూర్చి యిలా చెప్పాడు.

"వీడు చూపులకు మాత్రం అతి సుందరాంగుడు. చేసే పనులనుబట్టి మహాక్రూరుడు. వీడు ఊరుకొకపేరుతో చలామణి యగుచున్న దుర్మార్గుడు. వీడి పేరు వీరమల్లుడు. దేశంలో జరిగిన బందిపోటు దొంగతనాలకు, హత్యలకు వీడే కారకుడు. వీనివలన ఎన్నియోకుటుంబాలు నాశనమైనాయి. వీనినిబంధించుటకు రాజ భటులు అహోరాత్రులు కష్టపడ్డారు. నిన్నటిదినమున మనరాజభటులు వెంటాడగా, మన రాజపుత్రిక ఉద్యానవనమున ప్రవేశించినాడు. భటులూ, నేనూ ఆ ప్రాంత మందే ఉండి తిరిగి వచ్చినప్పుడు బంధించాము. ఈ ద్రోహికి తగిన శిక్ష విధించ గోరుచున్నాను." అని రాగమల్లుని ముందుకు త్రోశాడు సేనాధిపతి.

మహారాజు నిర్ఘాంతపోయాడు. రాత్రి భార్యవల్లా, కూతురువల్లా వాని సంగతి విన్నాడు మహారాజు. "ఇటువంటి ద్రోహినా రాజపుత్రిక వరించినది." అనుకున్నాడు. దేశద్రోహి, హంతకుడు అయిన- ఆ రాగమల్లునికి (వీరమల్లునికి) ఉరిశిక్ష విధించాడు మహారాజు.

ఈ విషయము నిర్మలకు తెలిసినది. "అతడు ఎవడుగాని, వానిని నేను ప్రేమించాను. వానిని క్షమింపుమని తండ్రిని వేడుకుంది. కాని, మహారాజుదేశ క్షేమము నాలోచించి ఆమె కోరికను తిరస్కరించాడు.

రాజభటులు రాగమల్లుని ఉరిదీశారు. ఈ వార్తవిన్న నిర్మల విషము త్రాగి తాను కూడ మరణించింది.

మహారాజా! వింటివిగదా నిర్మలా రాగమల్లుల కథ? నిర్మల మరణం వలన కలిగిన స్త్రీహత్యాపాతకం ఎవరికి చెందుతుంది? మహారాజుకా?" అని ప్రశ్నించాడు భేతాళుడు.

విక్రమార్కుడు క్షణం ఆలోచించి "భేతాళా! మహారాజుకు ఎందుకు చెందుతుంది? చెందదు. విక్రమజిత్తు తన రాజధర్మమును పాలించినాడు. కుమారిక కోరికనుగూడ తిరస్కరించి, తన విధితాను పాలించినాడు. కావున న్యాయంగా ఆలోచిస్తే – ఆ పాతకం మహారాజుకు చెందదు. పైపై మెరుగులకు, అంద చందాలకు భ్రాంతిపడి, యుక్తాయుక్తములు విచారింపక ప్రేమించిన నిర్మలకు తగిన శాస్త్రి ఆమెకు భగవంతుడే విధించినాడు. కావున ఆ పాతకం ఎవ్వరికీ చెందదు" అని సమాధాన మిచ్చాడు.

నియమభంగ కారణంగా వెంటనే భేతాళుడు విక్రమార్కుని భుజముపై నుండి ఎగిరి వృక్షము చేరుకొన్నాడు. విక్రమార్కుడు తిరిగి వెనుకకు బయలు దేరాడు.

విక్రమార్కుడు తిరిగి చెట్టువద్దకు వచ్చాడు; భేతాళుని బంధించాడు. భుజముపై వేసుకొని సన్యాసి ఆశ్రమానికి బయలుదేరాడు. తప్పించుకొను మార్గము నెరింగిన భేతాళుడు మరల నీకొక కథ నిట్లు చెప్పుట ప్రారంభించాడు.

# శారదా విశ్వదత్తుల కథ

విక్రమార్క మహీపాలా! నీ కొక చక్కని కథ చెబుతా: విని నా సందియానికి తగిన సమాధాన మిమ్ము. పూర్వకాలంలో ఆంధ్రావనియందు "విజయదుర్గము" అను పట్టణము ఉండేది. ఆ పట్టణమున సోమశేఖర దత్తు అనువాడు ఉండేవాడు. ఆతని ఏకైకపుత్రిక శారద. సుగుణాల రాశి. సౌందర్యవతి.

సోమశేఖరదత్తు చెల్లెలి కుమారుడు విశ్వదత్తు. విశ్వదత్తుని తల్లి తన అవసానకాలములో - తన పుత్రుని సోమశేఖరదత్తుకు అప్పగించి "వీడు అనాధుడు గాకుండా పెంచి, పెద్దజేసి, నీ పుత్రిక నిచ్చి వివాహము గావింపుము. ఇదియే నా కడసారి కోరిక" అని చెప్పి కళ్ళుమూసింది. సోమశేఖరదత్తు - విశ్వదత్తుని తన యింటనే ఉంచుకొని పెంచి పెద్ద చేశాడు.

కానీ, విశ్వదత్తు పెద్ద అగుచున్న కొద్దీ, మొద్దుగా తరుచు అయ్యాడు. చూస్తూ చూస్తూ విద్యలేని సోమరిపోతుకు తన కూతురును యివ్వడానికి సోమశేఖరదత్తు మనస్సులో బాధపడ్డాడు. అయినా చెల్లెలుకు తాను యిచ్చిన వాగ్దానము నిల్పుకొనుటకు, విశ్వదత్తుని విజ్ఞానిగా చేయుటకు అతడు బాగా ఆలోచించాడు; కాశీనగరంలో ఉన్న తన మిత్రునికి ఒకలేఖ వ్రాసియిచ్చి విశ్వదత్తుని కాశీనగరం పంపించాడు.

సోమశేఖరదత్తు మిత్రుడు చంద్రశేఖరదత్తు. అతడు మహాపండితుడు.

అతని విద్యా బోధనలో, విశ్వదత్తు అన్ని విద్యలలోను పరిపూర్ణుడయినాడు.అప్పటికి విశ్వదత్తునకు పరిపూర్ణ యౌవ్వనం కూడా వచ్చింది. విశ్వదత్తు గురువుగారి శిక్షణలో మంచి సత్ప్రవర్తనమూ, వినయ విధేయతలూ, లోకజ్ఞానమూ గడించుకొన్నాడు. దుర్వ్యసనాలను దగ్గరకు రానీయకుండా, మంచి గుణాలను అలవాటు చేసికొన్నాడు.

ఒకనాడు విశ్వదత్తు గురువుగారి అనుమతిపొంది, మామగారి యింటికి బయలుదేరాడు. అతనితో సహపాఠియగు నిరంజనుడు కూడా బయలు దేరాడు.

నిరంజన-విశ్వదత్తులు విజయదుర్గము చేరుకొన్నారు. అయిదేండ్లకాలం తను కాశీనగరంలో ఉండుటవలన, విజయదుర్గము వింతగా కనిపించిందివిశ్వదత్తుకు. అప్పటిలో ఉండే చిన్న చిన్న యిల్లు భవనాలు అయినాయి. వీధులు విశాలముగా చాల అందముగా వున్నాయి. ఆ వింతలు-- పూర్వంవిన్న పరిస్థితులు, అప్పటి పరిస్థితులు అన్నీ విశ్వదత్తు తోటి సహపాఠియగు నిరంజనకు చూపించుచు తీసుకొని రాసాగినాడు విశ్వదత్తు.

క్రమముగా మరొక భవనము ముందుకు వచ్చారు. అప్పుడే ఆ భవనమునుండి యొక కన్యవచ్చి ప్రక్క గృహములోనికి వెళ్ళింది. ఆ కన్యను చూచి నిరంజనుడు ఎంతో మోజు పడినాడు; ప్రేమించినాడు. ఆ కన్య ఎవరో కాదు; విశ్వదత్తునికి కాబోవు భార్య శారగా. విశ్వదత్తు మాత్రము ఆమెను చూచినవెంటనే గుర్తించినాడు.

నిరంజనుడు తన కోరిక విశ్వదత్తునికి చెప్పినాడు ప్రక్కకు పిలిచి. "ఎట్లయిన తనకు ఆ కన్నియ లభించునట్లు చేయు"మని ప్రార్థించినాడు. ఆ

కన్నియ తనకు లభించనినాడు ఆత్మహత్య చేసుకొందుననికూడ తన తుది నిర్ణయం కూడ వెల్లడించినాడు.

విశ్వదత్తుడు "ఈ కన్నియ నాకు కాబోవు భార్య; నా మేనమామ పుత్రిక" అని చెప్పివైచిన ఎట్లుండిదో!" కాని విశ్వదత్తు- మిత్రుని యొక్క ప్రార్థనతో ఆ మాట చెప్పలేక పోయాడు. పైగా "నీకా కన్నియ లభించుట కొరకై ఆమె తలిదండ్రులితో మాటాడెదను" అని వాగ్దానం చేసినాడు.

తరువాత విశ్వదత్తు మిత్రునితో ఆ గ్రామమున ఒక యింట బస చేసినారు. విశ్వదత్త మిత్రునిజూచి "మిత్రమా! నేను వచ్చువరకు నీవు యిక్కడనే యుండుము. మా మామగారి గృహమును ఆనవాలు పట్టలేకున్నాను. ప్రయత్నించి తెలిసికొనివత్తును. అట్లాగే ఆ కన్నియ యొక్క తలిదండ్రులతో కూడ మాటలాడి వచ్చెదను" అని చెప్పి, తానొక్కడూ అత్తవారి యింటికి వచ్చాడు.

చాలకాలమునకు వచ్చిన అల్లునిచూచి అత్తమామలు; కాబోవు భర్తను చూచి శారదయు మిక్కిలి ఆనందించిరి. తరువాత విశ్వదత్త అత్త మామలను-శారదను రహస్యముగా ఒక గదిలోనికి పిలిచి-తన మిత్రుని కథ యంతయు చెప్పెను. "మీరు యీ విషయమున నిర్లక్ష్యముచేసిన అతడు మరణించును. అందువలన మిత్రుని చంపుకున్న పాపము నాకును, బ్రహ్మ హత్యాపాతకము మీకును సంభవింపగలదు. కావున మీరందరును యీ విషయమును త్రోసి పుచ్చకుడు. ఆతడు కూడ సకల విద్యాపరిపూర్ణుడు, బుద్ధి మంతుడు. నా కంటెకూడ విద్యలలో గొప్ప విజ్ఞానము గలవాడు" అని అనేక విధముల బోధించి-ఎట్టకేలకు వారినందరినీ ఒప్పించినాడు.

విశ్వదత్తు అక్కడనుండి బయలుదేరి తిన్నగా మిత్రుడగు నిరంజనుడు

ఉన్న బసకు వచ్చాడు. "మిత్రమా! లెమ్ము. నేను ఆ కన్నియ తలిదండ్రులతో మాటాడి వచ్చాను. వారందరూ ఒప్పుకొన్నారు. వారు నిన్ను చూడవలెనని ఉత్సాహపడుచున్నారు. పెండ్లి ముహూర్తముకూడ నిశ్చయించుకొందాము" అని పలికినాడు. నిరంజనుడు ఉత్సాహంతో మిత్రునివెంట బయలుదేరాడు.

సోమశేఖరదత్తు నిరంజనుని చూచినాడు; శారదయు జూచినది. నిరంజనుని రూపురేఖలు, నమ్రత గమనించారు. శారదకు వెంటనే ఒక ఆలోచన కలిగింది. అందుచే ఆమె "నిరంజనునితో కొంచెము మాటాడవలసి యున్నది" అని తన కోరికను తెలియపరచెను. అందుకు అందరూ సమ్మతించిరి. వారిద్దరూ ఒక గదిలోనికి పోయిరి. ఒక అరగంట సేపటికే వారిద్దరూ మందహాసంతో బయటకు వచ్చారు.

నిరంజనుడు గదినుండి బయటకురాగానే విశ్వదత్తుని జూచి "మిత్రమా! శారదద్వారా నాకు అన్ని విషయాలు తెలిశాయి. తద్వారా, ఈమె నాకు చెల్లెలు అయినది. చెల్లెలిని పొందువాడు ఎందైనా ఉంటాడా? మరియు ఇంకొక శుభవార్త ఈ నా చెల్లెలు నిన్ను పరిణయమాడగోరుచున్నది. నా చెల్లెలిని సకల విద్యా విశారదుడవగు నీకు యిచ్చి వివాహము జరిపించుటకంటె నాకు ఆనంద మింకొకటి ఏది యుండును? నా కోర్కెమన్నించి నీ మిత్రుధర్మమును నిల్పు"మని ప్రార్థించెను.

విశ్వదత్తుడు జరిగినది గ్రహించెను. "శారద సత్యమును వెల్లడించి-నిరంజనుని మనస్సును మార్పించె"నని గ్రహించెను. తరువాత కొద్ది రోజులకే "శారదా-విశ్వదత్తుల కళ్యాణము జరిగినది."

"మహారాజా! వింటివిగదా కథ" ఇందు ఎవరి త్యాగము ఘనమైనది?" అని భేతాళుడు విక్రమార్కుని ప్రశ్నించెను.

విక్రమార్కుడు రెండు నిమిషము లాలోచించి "భేతాళా! సోమశేఖర దత్తు గృహయజమాని. ఆతని మాటకు ఆయింట తిరుగులేదు. మరియు తన చెల్లెలికి వాగ్దానము గావించినవాడు. విశ్వదత్తుని జామాతగా పొందుటకు అన్ని విద్యలు నేర్పించినవాడు. అట్టివాడు మేనల్లుని కోరికపై-ముక్కు మొగమెరంగని నిరంజనునికి తన ఏకైక పుత్రిక నిచ్చుటకు సమ్మతించినాడు. కావున ఆతని త్యాగమే చాల ఘనమైనది" అని సమాధాన మిచ్చినాడు.

వెంటనే నియమభంగ మగుటచే—తిరిగి భేతాళుడు యెగిరి వృక్షము పైకి చేరుకొన్నాడు. విక్రమార్కుడు మరల సురుగుచెందక-వృక్షము దిక్కు బయలుదేరాడు.

విక్రమార్కుడు వృక్షమును సమీపించి, భేతాళుని బంధించాడు. భుజముపై వేసికొని ఆశ్రమానికి బయలుదేరాడు. తప్పించుకొను మార్గము నెరింగిన భేతాళుడు మరల యింకొక కథ ప్రారంభించాడు.

## నచికేతుని కథ

మహీపాలా! మార్గాయాసం కలుగకుండా ఒక చక్కని కథ చెబుతా! వినుము. పూర్వం "వాజశ్రవుడు" అను ముని ఉండేవాడు. అతడు సత్యపుత్రుడు. కలలోకూడ అసత్యము చెప్పుట యెరుగడు. ఆతని కుమారుడు నచికేతుడు; సకల విద్యాపరిపూర్ణుడు. తండ్రివద్దనే విజ్ఞానమును ఆర్జించినాడు.

వాజశ్రవుడు ఒకప్పుడు "విశ్వజిత్తు" అనుయాగము చేయుటకు సంకల్పించుకొన్నాడు. ఆ యాగము చేయువారు తమకు ఉన్నదంతయు

దానము చేయాలి; చేయకపోతే యాగఫలము దక్కదు. మోక్షముకూడ లభించదు.

వాజశ్రవుడు దానం చేయునప్పుడు—పుత్ర వ్యామోహంతో మంచి మంచివి కుమారునికి ఉంచుచు, తక్కినవి దానం చేస్తున్నాడు. ఆ మునికి గోసంపద చాలా ఉంది. ఆ గోవులలో పాలు సమృద్ధిగా యిచ్చు గోవులను, కుమారునికి ఉంచుతూ, బక్కచిక్కిన వానిని దానము చేయసాగెను.

నచికేతుడు ఈ దానములను చూచి మిక్కిలి విచారించాడు. అయ్యో! మా తండ్రి పుత్రవ్యామోహంవల్ల దానంలోకూడ స్వార్థము చూపుతున్నాడు. ఇట్టిదానము వలన సద్గతి యెట్లు లభించును?" అని తలంచి, తండ్రిని చేరి "నాన్నగారూ! మీరు తలపెట్టిన కార్యము చాల పవిత్రమైనది. మోక్షము నొసగునది. కావున మీరు నాపై గల మమకారం విడిచి, మీ కార్యమును కొనసాగింపు"దని ప్రార్థించెను.

తండ్రి వినలేదు. అతడు యథాప్రకారముగా- మంచి మంచివి ఉంచుచు, మిగిలినవానిని దానము చేయుచుండెను.

కుమారుడు అది చూచి సహింపలేకపోయాడు. "తండ్రీ! మీరీ వస్తువులు, గోవులను విశ్వజిత్తు యాగమునకని మహారాజుల నుండి అర్థించి తెచ్చినవే గదా!" కాని, కొన్నిటిని మీరే సంగ్రహించుచున్నారు. "తస్కరులు, అసత్యవాధులు" అను పేరు కూడా మీరు యీదానాలవల్ల పొందనున్నారు. "ఇంత వరకు మగ వంశము నందు అనృతవాదులు జన్మించలేదు" అని మీరే అనేక సార్లు చెప్పి యున్నారు. మీ వాక్యంను మీరే విస్మరించుట మంచిది కాదు" అని హెచ్చరించాడు. తండ్రి అప్పటికి కూడా వినలేదు. పైగా మిక్కిలి కోపగించాడు.

నచికేతుడు ఊరుకోలేదు. యింకా యిలా అన్నాడు. "నా మీద గల మమకారము కొద్దీ, మీరిట్టి యకృత్యం చేయుచున్నారు. నేనీ దానములను చూడ జాలకొన్నాను. నన్ను కూడా ఎవరికైన దానమొసంగుడు; అప్పుడు మీరు సర్వసంగ పరిత్యాగులు కాగలరు అన్నాడు.

మునికి చాలా కోపం వచ్చింది. దూరం ఆలోచింపక "ఔను; నిన్ను మృత్యుదేవతకు దానం చేస్తాను; పిల్వ" మని అన్నాడు. నచికేతుడు సంతోషించాడు. "తండ్రీ! పిలుచుట యెందుకు? నేనే స్వయంగా యముని దర్శించెదను. మీరు యాగమును పూర్తిచేసి, మోక్షమును పొందుడు" అని పలికి యముని దర్శించుటకై తండ్రియనుమతిని కోరెను.

ముని-తాను కోపమున అన్నమాటలను మననం చేసికొన్నాడు. "అయ్యో! ఎంతపని జరిగినది! యమునివద్దకు పంపకపోతినా, అసత్యవాదిని కాగలను; పితృదేవతలు నాపై యలిగి శపింతురు. పంపించినచో ఉన్న ఒక్క కుమారుడు దూరమగుతాడు! ఇక నే జీవించుట ఎట్లు? ఎందుకు?" అని కుమారునికి యనుమతి నిచ్చుటకు వెనుకాడెను.

నచికేతుడు తండ్రి మనస్తాపం గ్రహించి "నాన్నగారూ! మీరు అల్పుల వలె అవివేకములో మునుగుచున్నారు. ఎన్నిటికైనను ఈ మృత్యువు తప్పునది కాదు. పుట్టుట—గిట్టుట మానవనైజమే కదా! కావున, తాము నాపై మమకారమును విడిచిపెట్టుడు. సత్యవాక్పరిపాలనము గావించి యశస్సు గాంచుడు" అని ప్రార్థించినాడు.

తండ్రి ఆలోచించాడు. "ఔను; నా పుత్రుడన్నది నిజమే. ఈ మమకారములన్నీ సత్యవ్రతముకంటె చాల అల్పములే "అని తలంచుకొని కుమారుని ఆశీర్వదించి యమలోకంనకు పంపించాడు."

"మహారాజా! కథ వింటివిగదా! తండ్రి యొక్క మోక్షమును వాంఛించి యమలోక మేగిన కుమారుడు (నచికేతుడు) గొప్పవాడా! లేక సత్య శీలమునకై కుమారుని విడనాడిన తండ్రి (వాజశ్రవుడు) గొప్పవాడా?" అని భేతాళుడు మహారాజును ప్రశ్నించెను.

విక్రమార్కుడు ఆలోచించి "భేతాళా! నచికేతుడే గొప్పవాడు. తండ్రికి మాత్రమేగాక, తనవంశమునకెల్ల "అనృతదోషం కల్గకుండా ప్రవర్తించినాడు. ఇట్టి ఉత్తమాదర్శముగల నచికేతుని ఆ యముడు ఎట్లు స్వీకరించినెలా మరి! అతడు ధర్మదేవత కూడ" అని విక్రమార్కుడు తన సందేహమును వెల్లడించెను.

"సత్యం గ్రహించావు మహారాజా! యముడు నచికేతుని స్వీకరించ లేదు. అతని శీలమునకు మెచ్చుకొని "ఆత్మస్వరూపం" అను ఆత్మజిజ్ఞాసను బోధించి—ఆశీర్వదించి-తిరిగి అతనిని తండ్రియగు వాజశ్రవుని వద్దకు పంపివేసెను." అని పలుకుచు ఎగిరి వృక్షంను చేరుకొన్నాడు.

విక్రమార్కుడు తిరిగి భేతాళుని బంధించి తెచ్చుటకు వెనుకకు మరలి నాడు.

పట్టువదలని విక్రమార్కుడు తిరిగివచ్చి భేతాళుని బంధించి పట్టు కొన్నాడు. భుజంపై వేసుకొని సన్యాసి ఆశ్రమానికి బయలుదేరాడు. భేతాళుడు తిరిగి యిట్లు యింకొక కథ ప్రారంభించాడు.

# శంఖ చూడుని కథ

"మహారాజా! యీ కథకూడ ఆలకించి నాయనుమానం తీర్చు-అదేమి టంటే:- పూర్వం జీమూతకేతువనే విద్యాధర రాజు ఉండేవాడు. అతనికి కోరిన

కోరికలను తీర్చు "కల్పవృక్షం" కూడా ఉండేది. ఆ కల్పవృక్ష మహిమవలన ఆతడు తన రాజ్య ప్రజలకు ఎన్నో శుభములను కలిగించేవాడు. ఆతని ప్రజలందరు అతనికి ఎంతో వినయముగా ప్రవర్తించుచుండేవారు.

జీమూతకేతువునకు చాలకాలమునకు విష్ణువరప్రసాదమున "జీమూత వాహనుడు" అను కుమారుడు జన్మించెను. ఆ జీమూతవాహనుడు క్రమక్రమంగా దినదిన ప్రవర్ధమానుడై, రాకా సుధాకరుని రీతి వృద్ధి పొందుచు యుక్తవయస్సు గల వాడయ్యెను. తండ్రి కుమారునియొక్క మంచి గుణములను గాంచి ఎంతో సంతోషించెడువాడు. జీమూతవాహను "సర్వప్రాణులు దు:ఖములేక ఆనందంగా ఉండాలని" సదా కోరుతుండేవాడు.

కొంతకాలంనకు జీమూతకేతువు-కుమారుడగు జీమూత వాహనునికి విద్యాధరరాజ్యము పట్టాభిషేకముచేసి, తపస్సు చేసికొనుటకు, భార్యతోసహా వనంలకు వెళ్ళిపోయాడు.

జీమూత వాహనుని యొక్క అహింసా మార్గమును కనిపెట్టిన శత్రు రాజులు కొందరు ఏకమై విద్యాధరరాజ్యంపైకి దండెత్తి వచ్చారు. జీమూత వాహనుడు అఖిల శస్త్రాస్త్ర విద్యలయందును నిపుణుడే. కానీ ప్రాణహింసకు సహించని స్వభావము కలవాడు. అందరూ ఆనందంగా ఉండాలనే కోరిక గలవాడు కావున, శత్రువులను జయించు శక్తిగలవాడయ్యును, యుద్ధమునకు పూనుకొనక రాజ్యంను వారికి అప్పగించి వేశాడు. కల్పవృక్షమును ప్రార్థించి-తన రాజ్య ప్రజలందరికి సువర్ణమును ప్రసాదింపజేసినాడు.

మహామహిమగల యా కల్పవృక్షము జీమూత వాహనుని ప్రార్థన మేరకు ఆతని రాజ్యమెల్లెడల కనకవర్షం కురిపించింది. ప్రజలు ఐశ్వర్యవంతు

లయ్యారు. కల్పవృక్షం స్వర్గంనకు వెళ్ళిపోయింది. జీమూతవాహనుడు తన పరివారముతో మలయ పర్వత ప్రాంతంనకు చేరుకొన్నాడు. శాంతియుతంగా జీవితం గడుపుకొనుచున్నాడు.

ఆ మలయగిరి ప్రాంతమంతయు విశ్వావసు అను సిద్ధునికి చెందినది. విశ్వావసునకు "మిత్రావసువు" అను కుమారుడును, "మలయవతి" అను కుమారితయు నుండిరి.

మలయగిరి ప్రాంతమందే చిన్న ఆశ్రమమేర్పరచుకొని యున్న జీమూతవాహనుకి, మిత్రావసువునకు స్నేహం ఏర్పడినది. ఆ స్నేహం క్రమ క్రమంగా వృద్ధిచెందినది. అది కారణంగా కొన్ని రోజులకు మిత్రావసువు తండ్రిని ఒప్పించి, తన చెల్లెలను "మలయవడి"ని జీమూతవాహనుకి యిచ్చి వివాహం గావించాడు.

మలయవతి గౌరీదేవిభక్తురాలు. సదా పార్వతీదేవిని ప్రార్థించెడిది. గౌరీదేవికి నిత్యపూజలు జరిపి, నైవేద్యం పెట్టినగాని తాను భుజించెడిది కాదు. పార్వతీదేవియు, మలయవతిని అనేక విధముల కంటికి రెప్పవలె కాచి, కాపాడు చుండెడిది.

బావమరదులు (మిత్రావసువు–జీమూత వాహనులు) ఒకనాడు సాయం కాలం షికారుగా బయలుదేరి-మలయగిరి సానువుల మీదికి వచ్చిరి. అచ్చట జీమూతవాహనునికి ఒక యెముకల రాశి, మిల మిల మెరయుచు, వెండిపొర గప్పిన దానివలె కన్పించింది. దానిని జూచి జీమూతవాహనుడు "బావా! ఆ ఎముకలరాశి మేమిటి? అంత పెద్దయెత్తున పడియున్నది? అది యేమిటో, ఎందులకిట్లున్నదో తెలియునా? ఈ రాశి యంతయు నాగుల (పాముల) యొక్క-

ఎముకలవలెనే కన్పించుచున్నది" అని ప్రశ్నించెను. మిత్రావసువు ఆ మాట లాలకించి, "బావా! అది యొక పెద్దకథ! గరుత్మంతుని క్రోధానికి ఆహుతియైన నాగుల యొక్క ఎముకలరాశియే అది" అని పలికెను.

"నీకు తెలిసినంతవరకు ఆ కథ వినిపించు బావా!" అని జీమూత వాహనుడు అడిగాడు. మిత్రావసువు ఆ సర్పరాశి యొక్క కథ యిలా వివరించాడు.

# మిత్రావసువు చెప్పిన నాగసంతతి కథ

"కశ్యప ప్రజాపతి భార్యలు వినత, కద్రువ అనువారలు. కద్రువకు బుట్టిన వారందరూ నాగరాజులు. వారందరూ లెక్కకు శక్యము గానివారట; వినత కుమారులు ఇద్దరే. వారు గరుత్మంతుడు; అనూరుడు అనువారు.

కద్రువ మోసముతో వినతను తనకు దాసిగా చేసికొన్నదట! అందువలన వినతాకుమారుడగు గరుత్మంతుడు కూడ వారికి (ఆ నాగులకు) దాసుడయాడు. కొంతకాలానికి గరుత్మంతుడు పెద్దవాడై జరిగినది తెలిసికొని, దేవలోకమునకుపోయి ఇంద్రుని జయించి అమృతం సంపాదించి తెచ్చి-కద్రావకు యిచ్చి తన తల్లి దాస్య విముక్తికి నుండి తప్పించుకొన్నాడు. "అమృతము తెచ్చి యిచ్చినమీరు దాస్య విముక్తులగుతారు" అని కద్రావ చెప్పినది. కావున గరుత్మంతుడు మాతృదాస్య విముక్తికి, చాల కష్టపడి- ఇంద్రుని ఓడించి అమృతం తెచ్చి వారికి యిచ్చినాడు.

గరుత్మంతునికి నాగులపై కోపము పోలేదు. చాలకాలం తల్లిని తనను వారు దాసులుగా చేసికొని చాల కష్టపెట్టినారు. ఆ కసితో గరుత్మంతుడు దాస్య

విముక్తి కాగానే, నాగులపై విజృంభించి కనబడిన ప్రతి సర్పమును భక్షించుట మొదలుపెట్టాడు. అది ఆదిశేషువు భరించలేకపోయాడు. "తన వంశము రోజూ గరుత్మంతునివల్ల నశించిపోంతోదని" విష్ణువుతో మొరబెట్టుకొన్నాడు. విష్ణువుకు వాహనం గరుత్మంతుడు. అందువల్ల ఆయన గరుత్మంతుని పిలిచి మందలించాడు. రోజుకొక నాగును భక్షించుటకు అనుజ్ఞనిచ్చాడు. ఆ ఆనతిమేరకు గరుత్మంతుడు ప్రతిరోజూ ఒక సర్పాన్ని యీ మలయగిరిమీద భక్షించుచున్నాడు. ప్రతిరోజు ఒక సర్పం ఈ పర్వతం మీదికి వస్తుండడం, గరుత్మంతుడు భక్షించడం జరుగుతోంది. అలా గరుత్మంతుడు భుజించిన సర్పముల యొక్క ఎముకలే ఆ యెముకరాశి అని తెలియజేశాడు మిత్రావసువు.

ఆ సమయంలోనే గరుత్మంతునకాహారముగా పంపబడ్డ "శంఖచూడు" డను నాగము అక్కడకు వచ్చాడు. అతనితల్లి కుమారునికై దుఃఖించుచువచ్చినది. ఆ దృశ్యము కరుణామయుడగు జీమూతవాహనుని కంట బడగానే ఎంతయో బాధపడినాడు. ఆ నాగబాలు నొక్కనినైనా బ్రతికించి, అతని తల్లికి పుత్రశోకము లేకుండా చేయాలని నిశ్చయించుకొన్నాడు.

మిత్రావసువును యింటికి పొమ్మని చెప్పి, తానొక్కడే అక్కడ వుండిపోయాడు. శంఖచూడుడు (సర్పము) స్నానము చేసి వచ్చుటకు ప్రక్కనున్న నదికి పోయినాడు. జీమూతవాహనుడు శంఖచూడునివలె అక్కడ పరున్నాడు. గరుత్మంతుడు వచ్చాడు; తనకు నిత్యమూ వస్తున్న నాగబాలుడే అనుకొని జీమూతవాహనుని ఎత్తుకొనిపోయి- కొండ శిఖరంపై పెట్టుకొని భుజింపసాగాడు.

ఇంతలో స్నానం చేసి వచ్చిన శంఖచూడుడు ఆ దృశ్యము చూచి "ఆగు గరుత్మంతా! అతడు నాగుడు కాడు. నన్ను రక్షింపదలచిన విద్యాధర

పుత్రుడు జీమూతవాహనుడు. ఆతనిని చంపకుము "అని ప్రార్థించెను. గరుత్మంతుడు తన పొరబాటు తెలిసికొన్నాడు. వెంటనే స్వర్గమునకు పోయి అమృతం తెచ్చి జీమూతవాహనుని బ్రతికించినాడు. ఆనాటినుండి గరుత్మంతుడు కూడ తన నియమమును కూడ మానుకొన్నాడు.

మహారాజా! వింటివిగదా! కథ. ఈ కథలో ఎవరు గొప్పవారో చెప్పగలవా? తెలిసికూడ చెప్పక పోయినచో నీతల పగిలిపోగలదు" అని హెచ్చరించాడు.

విక్రమార్కుడు ఆలోచించి "భేతాళా! నీ దృష్టిలో జీమూతవాహనుడు గొప్పగా కన్పించవచ్చును. కానీ, అతని కంటె శంఖచూడుడే గొప్పవాడు. శంఖచూడుడు తన ప్రాణం దక్కినందుకు సంతోషించక, జీమూతవాహనునికై ప్రాకులాడాడు. యదార్థమును చెప్పాడు. జీమూతవాహనునికి ప్రాణము నిలిపాడు."అని పలికాడు.

ఈ విధంగా మౌనభంగం కావడంతో భేతాళుడు తుర్రుమని ఎగిరి చెట్టుపైకి చేరాడు. విక్రమార్కుడు తిరిగి భేతాళుని బంధించుటకు వృక్షముదిక్కుకు బయలుదేరాడు.

విక్రమార్కుడు మరల భేతాళుని తనకైవశము చేసికొన్నాడు. భుజముపై వేసికొని బయలుదేరాడు. తప్పించుకొనే మార్గం తెలిసిన భేతాళుడు మరల ఇంకొక కథనిట్లు ప్రారంభించాడు.

## సత్యశీలుని కథ

మహారాజా! నీకు మార్గాయాసం, బరువు తెలియనట్లుగా ఒక కథ

చెబుతా విను. పూర్వం ఒక గ్రామంలో సత్యశీలుడు అనే ఒక కోమటి ఉండేవాడు. అతడు మిక్కిలి పేదవాడు. అందువలన రకరకాలైన తినుబండారములను తయారు చేసి, ప్రక్క గ్రామాలకు పోయి అమ్ముకొనేవాడు. ఆ విధంగా వచ్చిన ఆదాయముతో కుటుంబాన్ని పోషించుకొనేవాడు.

ఒకనాడు మామూలుగా సత్యశీలుడు పదార్థాలను తయారు చేసికొని ఒక పళ్ళెములో నుంచుకొని ప్రక్క గ్రామానికి బయలుదేరాడు.

సత్యశీలుడు గ్రామానికీ, ప్రక్క గ్రామాలకీ మధ్య చిన్న చిట్టడవి ఉంది. జనసంచారం అంత ఎక్కువగా కూడ ఉండదు. అప్పుడప్పుడు మృగాలు కూడ తిరుగుతుంటాయి. అయినా, పొట్టకూటికై సత్యశీలుడు నిత్యమూ అటే వెడుతూ ఉండేవాడు; దైవం మీద భారంవేసి.

క్రమంగా సత్యశీలుడు చిట్టడివి మధ్య భాగానికి వచ్చాడు. అప్పుడు అతనికి ఎదురుగా ఒక సింహం వచ్చుట కనిపించింది. సత్యశీలుడు సింహాన్ని చూచి, భయముతో గజగజ వణికిపోయాడు. ఏమీ చేయాలో తోచక అలాగే నిలబడిపోయాడు.

సత్యశీలుని అదృష్టం బాగుంది. కాబట్టి ఆ వచ్చిన సింహం. సత్యశీలుని పరిస్థితి గమనించి దగ్గరకు వచ్చి "భయపడకు; నిన్నేమీ చేయను; హాయిహాయిగా జీవించు" అంది.

సింహం మాటలకు సత్యశీలుడెంతయో ఆనందించాడు. "మహాత్మా! నీవు యీ రూపంతో వచ్చిన దేవతవు. నాకు ప్రాణదానం గావించి, నా కుటుంబాన్ని రక్షించావు. ఇట్టి దయామతివైన నీకు, ఏమిచ్చినను తక్కువయే. కానీ నేను

నీకిచ్చునంతటి సామర్థ్యము లేనివాడను. ఇవిగో! యీ పదార్థములను భుజించి నాకు సంతోషం కలిగించుమని ప్రార్థించాడు.

సింహం వాని బుద్ధికి మెచ్చుకొంది. ఆ ఫలహారాలను భుజించింది. ఆ పదార్థాల రుచికి మెచ్చుకొని యిలా అంది.

"ఈ పదార్థాలన్నీ చాలా బాగున్నవయ్యా! ప్రతిరోజూ యిట్టిపదార్థాలే యుంటే-నేను మాంసభక్షణ కూడ మానుకుంటాను" అని.

సత్యశీలుడు సింహం మాటలకు ఆనందించాడు. "మహాశయా! మీకు అట్టి కోరికయే ఉంటే, ప్రతిరోజూ నేను రకరకాల పదార్థాలను తీసుకొని వస్తాను. నా ప్రాణాలను కాపాడినందుకు యీ రీతిగానైనా, నా కృతజ్ఞత చూపించు కుంటాను" అని వినయంగా చేతులు జోడించి పలికాడు.

ఆనాటి నుండి సత్యశీలుడు రకరకాల పదార్థాలను సిద్ధముచేసి, తెచ్చే వాడు. సింహం వానిని భుజించి- అతనికి విలువగల మంచి మంచి రత్నాలను యిచ్చేది. సత్యశీలుడు ఆ రత్నాలతో క్రమేపీ గొప్ప ధనవంతుడయాడు. అయినా తన సేవను మరచిపోలేదు. ప్రతిదినమూ సింహానికి పదార్థాలు తయారు చేసి భుజింపజేసేవాడు. కొన్నాళ్ళు గడించాయి.

సత్యసీలుడు, సింహము స్నేహంగా ఉండడం, సింహం జంతుహింస మానడమూ—సింహముయొక్క అనుచరులగు కాకికి, నక్కకూ యిష్టం కాలేదు. ఆ రెండూ ఆలోచించుకొని సింహానికి దుర్బోధ చేసేవి.

ప్రభూ! సత్యసీలుడు మీరనుకొన్నట్లు మంచివాడు కాదనట్లు మాకు తెలిసింది. తమకు ఆహార పదారాలలో విషం కలిపి చంపాలని చూస్తున్నట్లుకూడ తెలిసింది. కావున తాము జాగ్రత్తగా ఉండండి" "అని హెచ్చిరించాయి. వానిమాట

లతో సింహానికి అనుమానం కలిగింది సత్యశీలునిపై. చెప్పుడు మాటలు ఎంత మంచివానినియైననుమార్చివేయునుకదా!"

సరిగా అదే సమయానికి సత్యశీలుడు పదార్థాలను తీసికొని వస్తూ-సింహానికి ఒకప్రక్క కాకి, ఇంకొక ప్రక్క నక్క కూర్చొని ఏవో చెప్పడం చూచాడు; ఆ దృశ్యాన్ని చూచి-భయపడి- పళ్ళెమును అక్కడ దించి, ప్రక్కనున్న ఒక వృక్షము నెక్కి కూర్చున్నాడు.

సింహం తన అనుచరులతో చెట్టువద్దకువచ్చి మిత్రమా చెట్టుపైకూర్చున్నావేమి?" అని ప్రశ్నించింది. సత్యశీలుడిలా సమాధానమిచ్చాడు.

"ప్రభూ! తమరు మంచివారే- మిమ్ముజూచి నేనెప్పుడూ భయపడను. కాని మలిన మనస్సులైన మీ అనుచరులను జూచి భయపడు చున్నాను. యజమాని మంచివాడైనా, సేవకులను బట్టి వారి మారిపోవు చుంటారు. మీకు దుష్టుల సహవాసము కలిగినది; వారి బోధనలతో మీ మనస్సుమారే అవకాశం ఉంది. కావున ఇక మీతో నుండుట ఉచితమైన కార్యముకాదు. మీ దయవలన నేను ధనవంతుడనైతిని. మిమ్ము ప్రతిరోజు తలచుకొనుచు జీవితము గడుపుదును. ఇకనన్ను మరచిపొండు" అని కృతజ్ఞతా పూర్వకంగా అంజలి ఘటించాడు.

సింహం వాని మాటలలోని సత్యము గ్రహించి"సిగ్గుపడివెళ్ళిపోయింది."

"మహారాజా! వింటివిగదా! కథ? ప్రాణదానం కావించిన సింహంపల్ల సత్యశీలుడు కృతఘ్నుడైనాడు గదా!" అని భేతాళుడు ప్రశ్నించాడు.

విక్రమార్కుడు- "కాదు. సత్యశీలుడు నిజమే చెప్పినాడు" అన్నాడు.

విక్రమార్కుని జవాబుతో భేతాళుడు రివ్వున ఎగిరి వృక్షము చేరు కొన్నాడు. విక్రమార్కుడు మరల వెనుకకు ప్రయాణం సాగించాడు.

విక్రమార్కుడు మరల భేతాళుని బంధించి- ఆశ్రమానికిబయలుదేరాడు. భేతాళుడు యీ దిగువ కథ చెప్పుటకు ప్రారంభించాడు.

## నంద గోపాలుని కథ

విక్రమార్క- భూపాలా! ఆలకించి నా యనుమానం తీర్చు. పూర్వం ఒక గ్రామంలో ధనపాలుడనే శ్రీమంతుడుండేవాడు. అతనికి ధనగర్వం చాలాఉండేది. తానే ఆ గ్రామానికి ధనవంతుడగుటవల్ల— లోకంలోనే తనకంటె గొప్పవాడు లేడని భ్రమించేవాడు. అంతేకాదు, తాను ఏమన్నను గ్రామవాసులందరూ "బా" నని మెచ్చాలని కూడ భావించేవాడు.

ఇట్టి గర్వముతో అతడు "చిన్నా పెద్దా" అను తారతమ్యంలేకుండా అందరినీ ఏదో విధంగా అవమానించేవాడు. కవినిగాని, పండితునిగాని, గాయకుని గాని మర్యాదగా చూడక— ఆక్షేపించేవాడు. వారుకూడ "గ్రామానికి అతడే చాల ధనవంతుడు కాబట్టి- అతని శ్రీమంతానికి భయపడి- ఏమీ అనేవారు కారు.

ధనపాలుడు ఎక్కడికి వెళ్ళినా, పల్లకీనెక్కి- వెళ్ళేవాడు. కారణ మేమంటే అతనికి ఒక కాలు లేదు; కర్రకాలు ఆధారంగా యింట్లో నడిచే వాడు.

ఒకనాడు ధనపాలుడు పల్లకీమీద ప్రక్క గ్రామానికి బయలుదేరాడు. గ్రామం చివర ఒక పచ్చని పచ్చిక మైదానం ఉంది. అక్కడ ఒక గొల్లపిల్ల

వాడు ఆలమందను, గొర్రెలను మేపుకుంటున్నాడు; వానిపేరు నందగోపాలుడు. పశువులు దూరంగా మేత మేస్తున్నవి. గొర్రెలు మేకలు ఆ పిల్లవానికి సమీప మందే గడ్డి మేస్తున్నాయి. నందగోపాలుడు ఒక చెట్టుక్రింద కూర్చుండి హాయిగా పాడుకుంటున్నాడు.

"దినకుల మాణి నాయనా! శ్రీ రమణా!" అని ఎంతో శ్రావ్యంగా విని పించే ఆ పాటలు విని, ధనపాలకుడు పల్లకీని ఆపించి, పాట సాంతంగా ఆల కించాడు; ఎంతో ఆనందంతో పరవశమైపోయాడు.

తరువాత నందగోపాలుని పిలిచి "రేపు మా గృహానికి రారాఅబ్బాయీ! మంచిగా పాడినావు. ఇంటిలోని వారుకూడ ఆనందిస్తారు. నీకు మంచి యినాము యిస్తా"నని అన్నాడు ధనపాలుడు.

మరునాడు నందగోపాలుడు— తనకున్న మంచి దుస్తులలో మంచిదానిని ఎన్నుకొని - ఆ వస్త్రములను గట్టుకొని శ్రీమంతుని యింటికి వెళ్ళాడు. అప్పటికే శ్రీమంతుని భవనంలో ఒక హాలులో చాలామంది కూర్చుని యున్నారు. నంద గోపాలుడు వారందరనూ చూచి మొదట భయపడినాడుగాని, తారువాత ధైర్యము తెచ్చుకొన్నాడు.

శ్రీమంతునికీ, సభలోని వారందరికీ నమస్కరించాడు. ధనపాలుని యజ్ఞతో నందగోపాలుడు తనకు వచ్చిన పాటల నన్నిటినీ శ్రావ్యముగా-లయ బద్ధంగా పాడినాడు; అందరూ చాల సంతోషించారు.

శ్రీమంతుడు చాల ఆనందించాడు; ఒక పళ్ళెరంలో బట్టలు, రూపా యలు మొదలైనవి ఉంచి ఆ పిల్లవానికి బహూకరించాడు. పిల్లవాడు ఆనందంతో స్వీకరించాడు.

శ్రీమంతుడు ఆ ధనపాలునికి తన అలవాటు పోలేదు. ఆతడు నంద గోపాలుని చూచి "నిన్ను ఎంత చక్కగా వరించిందిరా! ఆ సరస్వతీదేవి! ఆ సరస్వతికి కన్నులులేవురా! ఉంటే నీ వంటి నిర్భాగ్యుని వరించకుండా ఉండేది" అన్నాడు.

నందగోపాలుని హృదయం చివుక్కుమంది. ఆనందమంతా మాయమై పోయింది. ఆ స్థానంలో కోపం బయలుదేరింది. "దొరగారు చెప్పిన మాటలు నిజమో కాదో తెలియదుగాని, లక్ష్మీదేవి మాత్రం పూర్తిగా గ్రుడ్డిదిదొరా" అన్నాడు.

"అదెలారా?" అని ప్రశ్నించాడు శ్రీమంతుడు.

గ్రుడ్డిది కాకపోతే మీ వంటి కుంటివాని యింట ఉంటుందా దొరా?" అని అన్నాడు నందగోపాలుడు నవ్వుతూ.

నందగోపాలుని మాటలువిని అక్కడ ఉన్న వారందరూ "ఫక్కున" నవ్వారు. శ్రీమంతుడు సిగ్గుచే తలవంచుకొన్నాడు. ధనపాలుడు ఆనాటినుండి తన అలవాటును మానుకొన్నాడు కూడ.

"విక్రమార్క భూపాలా! వింటివిగదా! శ్రీమంతుడు పదిమంది ధన వంతులముందు- నందగోపాలుని గౌరవించాడు: ఆ గౌరవాన్ని పాటించకుండా నందగోపాలుడు శ్రీమంతుని అవమానించాడు. ఇది నందగోపాలుని అవివేకము కాదా?" అని ప్రశ్నించాడు భేతాళుడు.

వెంటనే విక్రమార్కుడు "కాదు. ధనగర్వమువల్ల విర్రవీగేవారి కందరకూ తగిన నీతి బోధించాడు, గొల్లపిల్ల వాడైనా "అభిమానం గలవారన్ని

కుటుంబాలలోనూ ఉంటారు." అను సత్యాన్ని గూడ వెల్లడిచేశాడు నందగోపాలుడు. అని సమాధానమిచ్చాడు.

ఈ విధంగా నియమభంగమైనందునల్ల భేతాళుడు తిరిగి వృక్షంపైకి చేరాడు. విక్రమార్కుడు మరల భేతాళుని బంధించుటకై వెనుకకు బయలు దేరాడు.

విక్రమార్కుడు విసుగుచెందక మరల వృక్షం చేరుకొన్నాడు; భేతాళుని బంధించి భుజముపై నిడుకొని, ఆశ్రమానికి బయలుదేరాడు. విక్రమార్కుని సహనం పరీక్షింప గోరిన భేతాళుడు యింకొక కథ ఇట్లు ప్రారంభించినాడు.

# గంగాధరుని కథ

పూర్వం కళింగదేశమందలి "పువ్వాడ" గ్రామంలో గంగాధరుడు అనే రైతు ఉండేవాడు. అతనికి పాడిపంటలు విశేషంగా ఉండేవి. అందువలన అతని యింట కోళ్ళు కుక్కలు, ఆవులు బర్రెలు యెక్కువగా ఉండేవి.

గంగాధరునికి యోగులు, యతులు, మునీశ్వరులు అంటే చాల యిష్టం. అట్టివారు తమ గ్రామం వచ్చినప్పుడు గంగాధరుడు వారిని తన యింటికి ఆహ్వానించేవాడు. వారికి సకల సదుపాయాలు చేసి, వారి ఉపదేశాలను వింటుండే వాడు.

ఒకసారి ఒక మహాయోగి గంగాధరుని యింటిలో ఉన్నప్పుడు, ఆయనకు చాల గౌరవంతో గంగాధరుడు పూజాదులు నిర్వర్తించి సేవ చేశాడు.

ఆ మహాయోగి గంగాధరుని సేవలకు సంతసించాడు. తాను వెళ్ళు నప్పుడు ఒక దివ్యమంత్రాన్ని గంగాధరునికి ఉపదేశించాడు. ఆ మంత్రప్రభావం

ఏమిటంటే, పశువులు గానీ, పక్షులుగానీ, కీటకములుగానీ-ఏమి మాటలాడుకునేది అర్థము అవుతుంది.

ఆ మహాయోగి మంత్రం ఉపదేశిస్తూ, గంగాధరునికి ఒక హెచ్చరిక చేశాడు. అదేమిటంటే, "నువ్వు ఈ పశుపక్షి కీటకముల సంభాషణ ఎవ్వరికీ చెప్పవద్దు. చెబితే తల పగిలి చచ్చిపోతావు" అని.

తరువాత కొన్ని దినములు దొర్లిపోయాయి. ఒకనాడు గంగాధరుడు పొలం నుండి యింటికి వచ్చాడు. పెరడులో మంచంవేసి ఉంది. విశ్రాంతి కోసం అతడు ఆ మంచంపై కూర్చున్నాడు. భార్యకూడ వచ్చి ఆతని ప్రక్క కూర్చుండి ఏదియో యింటిని గూర్చి చెబుతూ ఉంది.

ఆ సమయంలో ఒక చీమలబారు అటునుంచి వస్తూ మంచం దగ్గరకు వచ్చి ఆగిపోయింది. వెనుకనున్న చీమలు ముందున్న చీమలను ఉద్దేశించి "ఆగి పోయారేమి? పదండి" అన్నాయి.

ముందున్న చీమలు:— "ఇక్కడ మంచము అడ్డు వచ్చింది." అని సమాధానం చెప్పాయి.

"మంచాన్ని చూచి ఆగిపోయారా? దానిని ఒక్క ఊపుతో ఎగర గొడితే సరి" అన్నాయి; వెనుకనున్న చీమలు.

ముందున్న చీమలు! "అలా చేదామనే అనుకొన్నాము. కాని, మంచంపై ఆలుమగలు కూర్చుండి మాటాడుకొనుచున్నారు; వారికి అపాయము కలుగుతుంది కదా!" అని అన్నాయి.

ఆ మాటలు గంగాధరుడు విన్నాడు. వాని చివరి మాటలతో ఆతడు

ఫకాలున నవ్వాడు "ఈ చీమలెంత! వీని బలమెంత? మాకు అపాయం కల్గునని ఊరుకొన్నాయా?" అన్న భావనతో గట్టిగా నవ్వాడు.

గంగాధరుని భార్య, భర్తను చూచి- "ఆ నవ్వు ఏమిటి? నా మాటలు మీకంత నవ్వులాటగా ఉందా?" అని- 'కారణం చెప్పు'మని మంకుపట్టు పట్టింది.

గంగాధరుడు తాను నవ్విన కారణం చెబితే, మరణిస్తాడు. అందువలన "నీ ప్రశ్నకు నేను నవ్వలేదు. వేరే యింకొక కారణమువల్ల నవ్వు వచ్చింది" అని చెప్పాడు. కానీ, అతని యిల్లాలు తన మంకుపట్టు విడిచిపెట్టలేదు. ఆ సంగతి ఏమిటో చెప్పేవరకూ భోజనంకూడ చేయనని భీష్మించి కూర్చున్నది.

మూడు రోజులు గతించాయి. ఆ యిల్లాలు నోట మంచినీళ్ళుకూడా పోసికోలేదు. "ఆలుమగల మధ్య-ఈ రహస్యాలేమిటి? చెప్పాలి; నేను భోజనం చేయాలి" అని మొండిపట్టు పట్టింది.

గంగాధరునికి ఏమీ తోచలేదు. "అదేమిటో చెప్పకూడదటయ్యా" అని బంధువులు—కూడ గంగాధరునే మందలించసాగారు. "అసలు సంగతి చెబితే మరణం తప్పదు; ఈ సంగతి వీళ్ళకు ఏమి తెలుస్తుంది." అని సరిపెట్టుకున్నాడు గాని, భార్యను చూచి బాధపడసాగాడు.

నాల్గవరోజు ఉదయం గంగాధరుడు ముఖం కడుగుకొనుచున్నాడు. సమీపంలో ఒక కోడిపుంజు చలచిత్తముతో కంటికి కనిపించిన ప్రతి ఆడకోడితోను సరసాలాడుచు సంతోషంతో తిరుగుతూ ఉంది.

అది చూచి ఆ యింటిలోని కుక్క, కోడితో యిలా అంది. "ఏమిటోయ్! నీ ఆనందం! మన యజమాని మూడు రోజులనుండి విచారంగా ఉన్నాడు, పెళ్ళాం తిండి తినడంలేదని, అదేమీ నీవు పట్టించుకోవడమే లేదు. నీ సంతోషమే

నీది. అతని సుఖము చూడాలి మనం. కాని యజమాని విచారంగా ఉంటే, మనం యిలా కులకడం మంచిది కాదు" అని హితబోధ చేసింది.

ఆ మాటలు విన్న కోడిపుంజుకు పౌరుషం వచ్చింది. "ఎందుకు మంచిది కాదు? యజమాని చేతకానివాడైనప్పుడు మనమెందుకు జాలి పడాలి; మగవాడై పుట్టాడు; ఆడదానివలె బాధపడుతున్నాడు. మగవానికి ఆడదానికి చెప్పరాని విషయాలు ఎన్నో ఉంటాయి. అవి ఆమె ఎందుకు అడగాలి? ఈయన ఎందుకు ఊరుకోవాలి? అవి నీకు చెప్పరానివని నయంతో చెప్పినప్పుడు, వినని ఆ యిల్లాలు-నాలుగు అంటించితే మరల ఆ మాట అడుగుతుందా? ఆడదానిని నెత్తి మీదకు ఎక్కించుకొంటే యిలాగే బాధపడాలి. పురుషత్వం లేని వాళ్ళగతి చూస్తూ-మనం సానుభూతితో మసలడమే మంచిది కాదు" అని సమాధానమిచ్చి తన సంబరంలో మునిగిపోయింది.

గంగాధరుడు ఆ మాటలు విన్నాడు. "నిజమే" అనుకొన్నాడు. కోడిపుంజు చెప్పినట్లే చేశాడు. ఆ యిల్లాలు తన జన్మలో అ నవ్వుగురించి అడగనే లేదు.

"విన్నావా మహారాజా! గంగాధరుని కథ. పాపము! కోడిపుంజువలన ఆ యింటి యజమానురాలు అనవసరంగా తన్నులు తినవలసి వచ్చింది" అన్నాడు భేతాళుడు.

"అనవసరం కాదు; అవసరమే. ఆడదానికి అంతమంకుపట్టు పనికి రాదు. ఎందుకు చెబుతున్నారో విని, నిదానంగా ఆలోచించుకోవాలి. యుక్తాయుక్తములు గమనించిన వారందరూ యిలాగే అవమానం చెందుతారు" అన్నాడు విక్రమార్కుడు.

విక్రమార్కుని మాటలతో నియమభంగమైనందున భేతాళుడు ఎగిరి పోయాడు చెట్టుమీదికి. విసుగు చెందకుండా విక్రమార్కుడు వృక్షము దిక్కుకు మరల తన ప్రయాణం సాగించాడు.

పట్టువదలిపెట్టకుండా, తిరిగి విక్రమార్కుడు వెనుకకు వచ్చి భేతాళుని బంధించి, తిరిగి సన్యాసి వద్దకు బయలుదేరెను. భేతాళుడు మరియొక కథ ప్రారంభించెను.

## కమలాక్షి కథ

విక్రమార్కభూపాలా! పూర్వం మగధదేశంలో గల ఒక ధనికునకు కమలాక్షి అను కూతురు ఉండేది. ఆమె చాల అందగత్తె. ఆమె అందచందములు విని, కృపాకరుడను యువకుడు వచ్చి, ఆ ధనికునిజూచి "అయ్యా! నేనను నీ సంపదకు సరిపడు ధనవంతుడనే. సాటి కులస్థుడను కూడ. మీ అమ్మాయిని గురించి వింటిని; స్వయంగా వచ్చి చూచితిని. ఆమెపై నా మనస్సు పోయినది. ఆమె లేకపోయిన నేను బ్రతుకజాలను. ఆమెను దయతో నాకిచ్చి పెండ్లి గావింపుడు. లేనిచో మీ యెదుటనే ఇక్కడనే మరణింతును" అని వేడుకొనెను.

ఆ ధనికునిపేరు విశాలహృదయుడు. అతడు ఆలోచించి "కృపాకరా! తొందరపడకు. నేను అమ్మాయితో ఆలోచించి రెండురోజులలో నీ కోరిక తీరుస్తాను" అని వాగ్దానం చేశాడు.

కృపాకరుడు వెళ్ళిన మరునాడే ధనగుప్తుడను ఒక ధనవంతుని కుమారుడు వచ్చి, కృపాకరుని నీతిగనే విశాల హృదయుని "నీ పుత్రికను నా కొసంగనిచో నీ కండ్లయెదుటనే మరణింతును" అని ఖచ్చితముగా తెలియ జేసెను.

విశాల హృదయుడు—కృపాకరునికి చెప్పినట్లుగనే చెప్పి ధనగుప్తుని పంపివేసెను.

ఆ మరునాడు జీవసిద్ధి అను సుందరాంగుడు వచ్చి విశాల హృదయుని కుమారితి కమలాక్షిని యిచ్చి పెండ్లిచేయమని ప్రార్థించెను.

విశాల హృదయుడు వానికిగూడ- కృపాకరునికి, ధనగుప్తునికి చెప్పి నట్లుగనే తెలియజెప్పి పంపించెను.

తరువాత విశాలహృదయుడు పుత్రికయైన కమలాక్షినిజూచి "అమ్మా! రేపటి దినము ముగ్గురు అందమైన యువకులు, ధనవంతుల పుత్రులు వస్తారు. వారు నిన్ను పెండ్లాడవలయుననియు, లేనిచో మరణింతుమనియు పలుకుచున్నారు. వారలు రాగానే, వారిన జూచి నీ యొక్క ఉద్దేశము చెప్పుము" అని తెలియ జేసెను.

కాని, ఆ రాత్రియే కమలాక్షి అకస్మాత్తుగా మరణించినది. ఆమెకై మరునాడు వచ్చిన ముగ్గురు ధనవంతుల పుత్రులు- ఆమె శవమును గాంచి మిక్కిలి దుఃఖించిరి.

తరువాత కృపాకరుడు కమలాక్షికి అగ్ని సంస్కారం చేశాడు. ఆ స్మశానమందే, ఆమె చితికి దగ్గరగానే ఒక చిన్న ఆశ్రమం ఏర్పాటు చేసికొని అందే నివసింపసాగెను.

ధనగుప్తుడు- కమలాక్షియొక్క అస్థులను తీసికొని, పుణ్యనదులలో కలుపుటకు వెళ్ళిపోయాడు.

జీవసిద్ధి జీవితంపై విరక్తిచెంది సన్యాసియై బయలుదేరాడు. మధ్య మార్గంలో ఒక సిద్ధపురుషుని దయవలన, జీవసిద్ధికి కొంచెం విభూతి లభించింది. ఆ విభూతిని మరణించినవారి చితిపై వేసినచో, తిరిగి బ్రతుకుదురని ఆ సిద్ధపురుషుడు చెప్పాడు.

జీవసిద్ధి వెంటనే ఆ విభూతితో కమలాక్షికి అగ్ని సంస్కారం చేసిన చోటుకు వచ్చాడు. కృపాకరుడు అక్కడనే ఉన్నాడుగదా! అస్థులు కలపడానికి వెళ్ళిన ధనగుప్తుడుకూడ అదే సమయానికి అక్కడకు చేరుకున్నాడు.

ముప్పురూ కలిసి చితాభస్మాన్ని పోగుచేశారు; విభూతిని మంత్రించి ఆ భస్మంపై వేశాడు జీవసిద్ధి. వెంటనే కమలాక్షి నిద్రనుండి లేచినట్లుగా లేచి కూర్చుంది. మరల వారు ముప్పురూ "కమలాక్షి" నా భార్య అని జగడానికి దిగారు.

"మహారాజా! విన్నావుగదా కథ! ఆమె యెవరికి భార్య అయితే ధర్మముగా ఉంటుంది?" అని ప్రశ్నించాడు భేతాళుడు.

విక్రమార్కుడు ఆలోచించి "కృపాకరునికి భార్య అయితేనే బాగుంటుంది" అన్నాడు.

"అవును; కమలాక్షి ఆలోచించి అట్లేచేసింది. బ్రతికించిన జీవసిద్ధిని తండ్రిగా భావించింది. అస్థులు పుణ్యనదులలో కలిపివచ్చిన ధనగుప్తుని పుత్రునిగా అంగీకరించింది. తనకొరకు అహోరాత్రులు ఆ స్మశానమందే కాపురంఉన్న కృపాకరుని భర్తగా స్వీకరించింది" అన్నాడు భేతాళుడు.

ఈ విధముగా విక్రమార్కునికి మౌనభంగం కావడంవల్ల భేతాళుడు ఎగిరిపోయాడు. విక్రమార్కుడు తిరిగి వృక్షము వైపు బయలుదేరాడు.

మరల విక్రమార్కుడు భేతాళుని బంధించి, భుజములపై వేసికొని సన్యాసివద్దకు బయలుదేరాడు. కానీ, భేతాళుడు ఊరుకోలేదు. ఇంకొక కథ యిలా ప్రారంభించినాడు.

# సన్యాసి - ధీరేంద్రుల కథ

మహారాజా! పూర్వము కాంభోజ నగరాన్ని వీరేంద్ర సింహుడనే రాజు పరిపాలించేవాడు. ఆతని కుమారుడు ధీరేంద్రుడు- ధీరేంద్రుడు చిన్నతనము నుండియు అనేక విద్యలు నేర్చుకొన్నాడు. మంచి అందగాడుకూడ. నీతిగలవాడే. అయినను వానికి ఒక వేశ్యతో సంపర్కము కలిగినది. అది మొదలు ఆమె యింటనే ఎక్కువగా వుంటుండేవాడు. ధీరేంద్రుడు యిచ్చుచున్నంత కాలమూ ఆ వేశ్య అతనిని బాగా చూచుచు వయ్యారాలు ఒలికించెడిది.

క్రమముగా ధీరేంద్రుని సంగతి— తండ్రికి తెలిసి కుమారునిపట్ల గట్టి బందోబస్తు చేయించినాడు. అందువల్ల కోటలో అతనికి ఒక్కరూక గూడ కోశాధికారి యిచ్చేవాడు కాడు. అయిననూ ధీరేంద్రుడు వేశ్యకు ధనము తెచ్చి యిచ్చేవాడు. ఆ ధనం ఎలాగు తెచ్చేవాడో తెలుసా !

మిత్రులవద్ద అబద్ధాలు చెప్పి తెచ్చేవాడు. "రాజపుత్రుడు" గదా! అని వారు యిచ్చేవారు. అదెంతకాలం సాగుతుంది? నెలరోజులకే వారికి విసుగు పుట్టింది; ఇవ్వడం మానివేశారు. ముఖం చూపించడము కూడ మానుకున్నారు. ధనము తెచ్చి యివ్వడం లేదని ఆ వేశ్య అతనిని ఇంటికి రానీయక తరిమివేసినది; ఇంకొక ధనవంతునితో కులుకసాగినది.

ధీరేంద్రుడు కోపము నణచుకొనలేక, యుక్తాయుక్తములు మరచి ఆ ధనవంతునితో జగడము పెట్టుకొన్నాడు. ధనవంతునికి కానిపని లోకములో ఉందా? అతడు కొంతమంది రౌడీలను పురమాయించినాడు. వారు ధీరేంద్రుడు ఒంటరిగా వెడుతున్న సమయంలో బాగా కొట్టి, ఒక అడవిలో పారవేసినారు. ఆ అడవి ఆ నగరానికి చాలా దూరం. ధీరేంద్రుడు తిరిగిరాడని, ఏ జంతువులో వానిని చంపివేయునని, తమమీద ఎవరికీ అనుమానం ఉండదని-ఆ రౌడీలు భావించి అలా దూరంలో గల అడవిలో పారవేశారు.

కానీ, ధీరేంద్రుని అదృష్టం బాగుంది. ఒక సిద్ధుడు అటు పోతూ ధీరేంద్రుని చూచి జాలిపడి తన ఆశ్రమానికి తీసికొనిపోయినాడు. కొద్ది రోజులకే ధీరేంద్రుడు ఆరోగ్యవంతుడయ్యాడు.

ఒకనాడు సిద్ధుడు ధీరేంద్రుని కథ అంతా విన్నాడు. "వీనికి కామేచ్ఛ యెక్కువగా ఉన్నది; వీని కామం తగ్గినగాని వీడు సరియైన దారికి రాడు" అని నిశ్చయించుకొన్నాడు. వెంటనే సిద్ధుడు తనయొక్క విద్యాప్రభావం ప్రదర్శించినాడు. ఆ ప్రభావంవల్ల అక్కడ ఒక దివ్యమైన సౌధము, అందు దాస దాసీజనము-భుజించుటకు తగిన షడ్రసోపేతమైన పదార్థములు, ధీరేంద్రుడు ఊహించనట్టి రంభను మించిన సుందరాంగి ఏర్పడినది.

ఆ విధముగా ధీరేంద్రుడు కొన్నాళ్ళు దివ్యభోగములు అనుభవించాడు. నెలరోజుల తరువాత సిద్ధుడు తన మాయావిద్యను ఉపసంహరించాడు. అందువల్ల అవి అన్నీ మాయమయ్యాయి. యథాప్రకారంగా అడవియే కనిపించింది.

అంగనాసంభోగానికి, రాజాధిరాజులకుగూడా జరగని సుఖజీవితానికి అలవాటుపడిన ధీరేంద్రుడు ఒక్కసారిగా అధోలోకములో పడిపోయినట్లయినాడు. సిద్ధుని ప్రార్థించినాడు. సిద్ధుడు కరుణించినాడు. మరల తన విద్యాప్రభావము ప్రయోగించి ధీరేంద్రుని ముచ్చట తీర్చాడు.

సిద్ధుడు ఒకనాడు ధీరేంద్రుని పిలిచి, "నాయనా! ఇక నీ విషయ వాంఛలను విడిచిపెట్టు. నీ రాజ్యమునకు పోయి హాయిగా నుండుము" అని హితోపదేశం చేశాడు. కానీ ధీరేంద్రుడు వినలేదు." ఇక కొద్ది రోజులు నాకు యీ ఆనందాన్ని ప్రసాదించుడు. తరువాత నేనే వచ్చి విన్నవించుకుందును. అప్పుడు మీ విద్య ఉపసంహరించుడు" అని ప్రార్థించెను. సిద్ధుడు సమ్మతించి, పోయి తన ఆశ్రమంలో తపస్సు చేసికొనుచుండెను.

తరువాత ధీరేంద్రుడు—క్రూరేంద్రుడయినాడు. "ఈ సిద్ధుడు మరల ఒక నెల రోజులకే వచ్చి బొమ్మనును. పోకున్న తన విద్యను ఉపసంహరించును. మరల అంతా అడవిగా మారిపోవును. కావున యిప్పుడే యీ సిద్ధుని లేకుండ జేసినచో యివి అన్నీ ఇలాగే ఉండిపోవును. నేను సదాసుఖముగా ఉండవచ్చును". అని తలపోసినాడు.

ఆ తరువాత ధీరేంద్రుడు ఒకనాడు అర్ధరాత్రమున ఖడ్గహస్తుడై సిద్ధుని ఖండించుటకు ఆశ్రమానికి బయలుదేరాడు. ఎప్పుడు ధీరేంద్రుడు మయా సౌధమునుండి బయలుదేరాడో-అప్పుడే ఆశ్రమంలో తపస్సమాధి యందున్న సిద్ధునికి ఒడలు జలదరించింది.

"ఏమిది! నా శరీరము అదరినట్లయినది. నాకేమైన ప్రమాదం సంభ వింపనున్నదా?" అని సిద్ధుడు అనుకొనుచుండగనే-దూరమునుండి ఖడ్గహస్తుడై దొంగవలె తక్కుచు తారాడుచు వచ్చుచున్న ధీరేంద్రుని రాక కనిపించినది. వాత్సల్యముతో చూచుచున్న ధీరేంద్రుడు ఖడ్గహస్తుడై వచ్చుచున్నాడు; నన్ను ఖండించుటకా? లేక విషయభోగములకు తృప్తి చెంది, మాయ ఉపసంహరించు మని చెప్పుటకా? అట్లయిన చేతిలో ఆ ఖడ్గ మెందులకు?" అని తలంచుచు- ఎందుకైన మంచిదని తన ఆత్మరక్షణకు తగిన కట్టుదిట్టము చేసికొన్నాడు. ఏమియు గమనించని వానితో తపస్సమాధిలో ఉన్నట్లుగానే కనులు మూసికొని కూర్చున్నాడు సిద్ధుడు.

ధీరేంద్రుడు ఆశ్రమంలోనికి దూరినాడు. "సిద్ధుడు మహాతపస్స మాధిలో ఉన్నాడు. చుట్టుప్రక్కల ఎవ్వరూలేరు. తను యీ పని చేసినట్లు ఎవ్వరూ

అనుమానించరు. ఇంతకంటె మంచి సమయం దొరుకదు" అని నిశ్చయించుకొని సిద్ధుని ఖండించుటకై కరవాలమును పైకి యెత్తెను.

కానీ, ఎత్తిన కత్తి ఎత్తినట్లే యుండిపోయినది. శిలాప్రతిమవలె ధీరేంద్రుడు నిలబడిపోయాడు. ఎటూ కదలలేక విలవిలలాడి పోతున్నాడు. సిద్ధుడు కన్నులు విప్పాడు. అతనిని జూచి సిద్ధుడు కోపము ఆపుకోలేకపోయాడు.

"క్రూరాత్మా! నిన్ను పుత్రవాత్సల్యముతో చూశాను. నీ కోరిక తీర్చుటకై కష్టపడి సంపాదించిన విద్యనుగూడ ధారపోశాను. అయినా, నీవు క్రూర బుద్ధిని చూపించావు. నన్ను చంపినంతమాత్రాన, నీకే భోగాలు స్థిరముగా ఉంటాయిరా మూర్ఖుడా! నీవంటివాడు యిక ఎన్నడూ బాగుపడడు. నేను బుద్ధిమంతుడవవుతావని భ్రమించాను. ఛీఛీ నీది పాషాణ హృదయమురా! ఇక నుండి నీవు పాషాణమువై (శిల) ఉందువుగాక! అని శపించాడు. ధీరేంద్రుడు పెద్దలాయిగా అయిపోయాడు.

"మహారాజా! విన్నావుగదా! కథ; సిద్ధుడు ఆ రాజకుమారుని శపించక వదిలిపెట్టవచ్చునుగదా! వాత్సల్యముచేత?" అని ప్రశ్నించాడు భేతాళుడు విక్రమార్కుని.

"లేదు; సిద్ధుడు చెప్పినదే సత్యము. అటువంటి క్రూరబుద్ధులు గలవారు-మరల తిరుగనారంభించిన, ఎన్నియో క్రూరాలు జరుగుతాయి. రాయిలా పడిఉంటేనే లోకం బాగుపడుతుంది. అందుకే సిద్ధుడు అటువంటి శిక్షవేశాడు" అన్నాడు విక్రమార్కుడు.

ఈ విధంగా మౌనభంగ మగుటచే, భేతాళుడు రివ్వున యెగిరి వృక్షము చేరుకొన్నాడు. విసుగుచెందని విక్రమార్కుడు తిరిగి వృక్షమువైపు పయనించాడు.

విక్రమార్కుడు తిరిగి భేతాళుని బంధించినాడు. భుజముపై వేసికొని వస్తుండగా-భేతాళుడు యింకొక కథ ప్రారంభించినాడు.

# వేదశర్మ కథ

విక్రమార్క మహీపాలా! పూర్వం వింధ్యారణ్య ప్రాంతములో ఒక గ్రామంలో వేదశర్మ అను బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు ఆ చుట్టుపట్లగల గ్రామాలలోని వారికి తిధివార, నక్షత్ర ఫలితాలను చెప్పుచూ వారిచ్చు-పప్పు బియ్యములతో తన కుటుంబాన్ని పోషించుకొనేవాడు.

వేదవర్మ భార్య సుశీల. వారికి చాల కాలానికి ఒక పుత్రుడు పుట్టాడు. ఆ బాలుని వారు చాల గారాబంతో పెంచుకొనేవారు. క్రమంగా ఆ బాలుడు అంబాడడు నుంచి తప్పటడుగులు వేసే ప్రాయానికి వచ్చాడు. అనగా రెండవయేడు వచ్చింది బాలునికి. వేదవర్మ ప్రతిరోజూ ఆయవారానికి ప్రక్క గ్రామాలకు పోయి, తాను సంపాదించిన వానితో సంతుష్టిగా, హాయిగా తన కుటుంబాన్ని పోషించుకొనేవాడు.

ఒకనాడు వేదవర్మ ప్రక్క-గ్రామాలకు పోయి, తిరిగి తన గ్రామానికి

వస్తుండగా, కనుచీకటి ప్రారంభమైంది. అయినా వేదశర్మ యింటికిపోయినగాని, మరునాటికి తిండి ఉండదు. తోడు కోసం కొంతసేపు ఎదురుచూశాడు. ఎవ్వరూ వస్తున్న జాడ కన్పించలేదు; అందువల్ల దైవంపై భారంవేసి బయలుదేరాడు.

అలా వస్తున్న వేదశర్మకు ఒక బ్రహ్మరాక్షసి ఎదురై యిలా అంది. "నరుడా! నరమాంసం కొరకు యీ అడవి అంతా గాలిస్తూ వస్తున్నాను. నా శ్రమ ఫలించింది" అంటూ వికటంగా నవ్వుతూ అతనిమీదికి వచ్చింది. వేదశర్మకు ఆ రాక్షసిని చూడగానే పై ప్రాణాలు పైనే ఎగిరిపోయాయి. భయంతో గడగడ వణికిపోతూ యిలా అన్నాడు.

"రాక్షసరాజా! నీకు చిక్కినవాణ్ణి నీకు కాకుండా ఎక్కడికి పోతాను. అయినా, నా కడసారి కోర్కెను దీర్చుట నీ ధర్మము! అని

రక్కసుడు ఆలోచించి "సరే! ఏమిటో అది వివరించు" అన్నాడు. "ముందుగా నాకు వాగ్దానం గావించు" అని చేయిసాచాడు బ్రాహ్మణుడు.

రాక్షసుడు బ్రాహ్మణుని ఎగాదిగ జూచి "నీ ప్రాణములు తక్క, ఏదైనా నీ కోరిక నెరవేరుస్తాను" అని చేతిలో చేయి వేశాడు. "రాక్షసరాజా! మాయిల్లు చాల దగ్గరగానే ఉంది. నాకు లేకలేక కలిగిన రెండేండ్ల పుత్రుడు ఉన్నాడు భార్య సుశీల ఉంది. ఇంక మా యింట ఎవ్వరూ లేరు. ఒకసారి వారిని చూచి వస్తాను. వారికి తగిన నీడ అంటే మా బంధువుల యింటికి పొమ్మని చెప్పి వస్తాను. నా భార్య మహాసాధ్వి. నా మాట మన్నిస్తుంది. నేను తెల్లవారకుండగనే వచ్చి నీకు ఆహారమవుతాను" అని విన్నవించుకొన్నాడు.

బ్రహ్మరాక్షసుడు "ఇంటికి వెళ్ళి నీవు తిరిగి వస్తావా? అయినా నేను వాగ్దానం చేశాను; బలవంతంగా నా చేత చేయించావు. కాబట్టి వెళ్ళిరా! తెల్లవార కుండగా రా! ఇక్కడనే ఉంటాను" అని పంపించాడు.

వేదశర్మ బ్రహ్మానందంతో యింటికి వచ్చాడు. భార్యకు జరిగినది అంతా చెప్పాడు. "సాధ్వీ! ప్రాణము పోయే సమయం వచ్చినా అసత్యమాడ వద్దని అందరికీ చెప్పేవాడిని, భగవంతుడు నాకే యీ పరీక్ష పెట్టాడు. నాకు వెళ్ళడానికి అనుమతి సంతోషంతో ఇయ్యి. నీవూ, బాబూ, మీ అమ్మగారింటికి వెళ్ళండి. సదా మిమ్ము భగవంతుడే కాపాడుతాడు" అని బోధించి-వేదశర్మ తిరిగి చెట్టువద్దకు వచ్చాడు.

బ్రహ్మరాక్షసుడు బ్రాహ్మణునికి రాకతో మిక్కిలి ఆనందం చెందాడు. "ఓ బ్రాహ్మణోత్తమా! నీ సత్యవచనానికి, నీ శీలానికి ఎంతో మురిపం కలిగింది. నీ వంటి సద్బ్రహ్మణులు యింకా యీ లోకంలో ఉన్నారంటే త్రిమూర్తులు గూడ హర్షిస్తారు. నీ వంటి పూజ్యుని చంపి నేను నరకానికి పోలేను. నీవు హాయిగా పోయి, నీ భార్య పుత్రులతో సుఖంగా జీవించు" అని పలుకుచూ అపారమైన బంగారాన్ని బహూకరించి పంపిచేశాడు.

"మహారాజా! విన్నావుగదా కథ. ఇందులో బ్రహ్మరాక్షసుడు గొప్ప వాడా? బ్రాహ్మణుడు గొప్పవాడా?" అని ప్రశ్నించాడు. విక్రమార్కుడు ఆలో చించి, భేతాళా! బ్రాహ్మణుడు స్వార్థాన్ని ఆశించినవాడు. బ్రహ్మరాక్షసుడు నర మాంస భక్షకుడు అయినా, మంచి ఆకలి సమయానికి దొరికిన ఆహార్నాగూడ-

స్వార్థముకోసంగాక, మాటను నిల్పుకొన్నాడు. బ్రాహ్మణుని విడిచివేశాడు. పైగా తరతరాలకు వానికి భోజనవసతి ఏర్పాటు చేశాడు. బంగారము నిచ్చి. కావున నా

దృష్టిలో బ్రహ్మరాక్షసుడే గొప్ప" అన్నాడు.

ఈ విధంగా మౌనభంగం కావడంతో భేతాళుడు ఎగిరిపోయాడు. విక్రమార్కుడు తిరిగి వృక్షము దిక్కు పయనం సాగించాడు.

విక్రమార్కుడు తిరిగి వృక్షమ్ము చేరుకొన్నాడు. భేతాళుని బంధించి భుజముపై వేసికొని సన్యాసి ఆశ్రమానికి చేరుటకు బయలుదేరాడు. తప్పించుకొనే మార్గము తెలిసికొన్న భేతాళుడు, విక్రమార్కునికి యీ క్రింది కథ చెప్పుటకు ప్రారంభించాడు.

# వ్యాఘ్రము-భల్లూకముల కథ

పూర్వము ఆంధ్రావనిలో పేరుగాంచిన నగరం పిష్టలాపురం. ఆ నగరానికి చుట్టుప్రక్కల అనేక చిన్న చిన్న గ్రామాలు ఉన్నాయి. అవి అన్నీ పిష్టలాపురానికి కప్పాలు చెల్లిస్తూ ఉంటాయి. వాని యొక్క (ఆ గ్రామాలయొక్క) బాగోగులన్నీ యీ నగరమే చూస్తూ ఉంటుంది.

అందువల్ల గ్రామోద్యోగులకు తరచు పిష్టలాపురానికి రాకపోకలు జరుగుతూ ఉంటాయి. లక్ష్మీపురం, పిష్టలాపురానికి ఎనిమిది మైళ్ళదూరంలో ఉంది. ఈ రెండు పురాలకు మధ్య ఒక చిన్న అడవి ఉంది. అందువల్ల రాత్రిపూట ఎవ్వరూ ఒంటరిగా ప్రయాణం చెయ్యరు. ముఖ్యమైన ప్రయాణాలయితే (వివాహాది శుభకార్యాలకు) తప్పని సరిగా వెళ్ళవలసిన పరిస్థితి అయితే పది మంది కలిసి వెడుతుంటారు; కాగడాలు వెలిగించుకొని, ఎందువల్లనంటే రాత్రి పూట క్రూరమృగ సంచారం ఉంటుందని ఆ గ్రామవాసుల నమ్మకం; నిజంకూడ.

ఒకనాడు లక్ష్మీపురం దివాణం నుండి పిష్టలాపురందివాణానికి ముఖ్యమైన సమాచారంగల పత్రాన్ని--అతిభద్రంగా దాచుకొని బయలుదేరాడు ఒక ఉద్యోగి. పగటిపూట రెండు గంటల ప్రాంతంలోనే బయలుదేరాడు; ఆ ఉద్యోగి. కాని. అడవిమధ్యకు రాగానే కుండపోతగా వర్షం ప్రారంభం అయింది. అందువల్ల ఆ ఉద్యోగి, ఒక చెట్టు క్రింద ఆగాడు. కానీ, ఎంతసేపటికీ వర్షం ఆగలేదు. వెళ్ళ వలసింది యింకా నాల్గుమైళ్ళ దూరం ఉంది. క్రమంగా సాయంకాలమైంది; చీకట్లు గూడ అలుముకోవడం ప్రారంభించాయి. వెనక్కి పోదామన్నా 4 మైళ్ళు పోవాలి; ముందుకు పోవాలన్నా నాలుగు మైళ్ళు పోవాలి. చీకట్లు క్రమంగా ఎక్కువ అవు తున్నాయి.

ఆ ఉద్యోగి వర్షం కొంచెం తగ్గగానే ముందుకే బయలుదేరాడు. తోడు ఎవరైనా దొరుకుతారేమోనన్న ఆశతో చూస్తూన్నాడు. కానీ, ఎవరూ దొరుకలేదు. దేవునిమీద భారంవేసి ఆ వర్షంలోనే ప్రయాణం సాగిస్తున్నాడు—ఆ ఉద్యోగి.

కొంత సేపటికి మధ్యమార్గంలో చిన్న జ్యోతుల్లా వెలుతురు కని పించింది-అతనికి. మొదట అవి యేవో దలపుకాంతులన భ్రాంతి పడ్డాడు. కానీ, కొంచెం సేపటికి అవి ఒక పెద్దపులి నేత్రాలుగా గోచరించింది అతనికి.

వెంటనే అతడు ప్రాణభీతితో పరుగెత్తుకొనిపోయి, సమీపమందే యున్న ఒక చెట్టు ఎక్కికూర్చున్నాడు. కాని, అతడు కూర్చున్న కొమ్మమీద ఒక భల్లూకం కూర్చుని ఉంది. కంగారుగా ప్రాణభీతితో ఎక్కిన ఉద్యోగి దాని ప్రక్కనే కూర్చున్నాడు: కూర్చున్నాక చూశాడు. దానిని వెంటనే గుండె గుభేలు మన్నది అతనికి. భయంతో శరీరమంతా చెమటలుపట్టాయి. గడగడ వణికి పోతున్నాడు. క్రిందికి దూకుదామని చూశాడు. అప్పటికి పెద్దపులి అక్కడే తిష్ట వేసి కూర్చున్నది.

పాపం! ఆ ఉద్యోగికి "ముందు గొయ్యి: వెనక నుయ్యి"లా అయింది. భయంతో గడగడలాడిపోతున్న-అతన్ని చూచి భల్లూకం జాలిపడింది. "ఓయీ! భయపడకు. నేను నిన్నేమీ అనను. ఈ పెద్దపులి చెట్టు ఎక్కి రాలేదు. నీకు సమయం దొరికేదాకా, యిక్కడే ఉండు. నీ ప్రాణానికి ఏమీ భయంలేదు. నేను హానిచెయ్యను." అని వానికి ప్రాణాదానం చేసి దగ్గరగా తీసికొని ఆద రించింది. క్రమంగా వర్షం తగింది. అర్థరాత్రి అయిపోయింది. వ్యాఘ్రం (పెద్దపులి, మాత్రం సమయంకోసం చూస్తూ అక్కడే కూర్చుంది. భల్లూకం ఒడిలోచేరిన ఆ ఉద్యోగి నిద్రకు తట్టుకోలేక దాని ఒడిలోనే నిద్రపోయాడు.

వ్యాఘ్రం ఆలోచించి కొంతసేపటికి భల్లూకంతో యిలా అంది:— "చూడు భల్లూకరాజా! ఈ నరజాతికి ఎప్పుడూ మన మృగ జాతిపై కక్షయే. అవకాశం చిక్కిందంటే చాలు; వీరు మనలను చంపడానికి వెనుకాడరు. అటువంటి ద్రోహులు ఈ నరులు. ఇట్టి నరజాతిపై నీ కింత కరుణ ఎందుకు? చేతికి చిక్కిన శత్రువులపై దయ జూపుట మంచిదికాదు. వానిని తొలగించుకొనుటయే నీతి. కావున నా మాట మన్నించి-వానిని విడిచిపెట్టు; నా ఆకలిని తీర్చుము. ఇందువలన నీకు పుణ్యమేగాని పాపము రాదు. ఒక శత్రువును కాపాడుట తోటివానిని చంపుట ధర్మము కాదుగదా! నా యాకలిని తీర్చి, నా ప్రాణములు కాపాడుము" అని ప్రార్థనాపూర్వకంగా, స్వార్థపూరితంగా పలికింది.

భల్లూకంగా యిలా బదులు పలికింది. "ఓ వ్యాఘ్రమమా! నీవుస్వార్థంతో ప్రార్థించుచున్నావేగాని, ధర్మం ఆలోచించుటలేదు. ఈ మానవుడు నీవు చెప్పినట్లు మనకు శత్రువే కావచ్చును. అంతమాత్రముచేత వీనిని చంపుట ధర్మము కాదు. పైగా వానికి నేను ప్రాణదానం చేశాను. నా వాగ్దానమును విశ్వసించి, నిశ్చింతగా నా ఒడిలో నిద్రపోవుచున్నాడు. ఇట్టి అమాయకుని నీ మాటలువిని నీ కందీయ జాలను. అనృతదోషంవల్ల సంభవించు నరకాన్ని అనుభవింపజాలను. కావున నీవు వీనిపై ఆశవదులుకొని వేరొక మార్గమును చూచుకో; నీ యాకలినితీర్చుకో" అని పలికింది.

అయినా, పెద్దపులి అక్కడనుండి కదలలేదు. మరి కొంతసేపటికి ఆ మానవుడు (ఉద్యోగి) మేలుకొన్నాడు. భల్లూకం ఒకింత ఆలోచించింది. మానవుని యొక్క మనస్సును కూడ తెలుసుకోవాలనుకొంది. మెలకువ చెందిన నరునితో

"ఓయీ! ఇంత సేపు నిన్ను కాపాడాను; చెట్టునుండి పడిపోకుండ నిన్ను జాగ్రత్తగా కనురెప్ప వేయకుండా కాపలా కాచాను. ఇక, ఇప్పుడు ఒకొంత సేపు నిద్రిస్తాను. నేను పడి పోకుండా చూస్తుండు" అని పలికి నిద్రపోయింది. కానీ, నిజంగా నిద్రించలేదు. పులి ఏమని బోధించునో! ఈ నరుడు ఎట్లా సంచరించునో!" అని గమనిస్తూనే ఉంది.

భల్లూకం నిద్రించిన కొంతసేపటికి వ్యాఘ్రము మానవుని ఉద్దేశించి "ఓయి నరుడా! నీవు భల్లూకం మాటలు నమ్మకున్నావుగదూ! అది అంతా నటన. నేను యింటికి వెళ్ళిన వెంటనే అది తన వాడియైన గోళ్ళతో చీల్చి చెండాడి నీ రక్తాన్ని త్రాగుతుంది. బ్రతికి ఉండగనే, నీవు విలవిల బాధపడుతూ ఉండగనే నిన్ను కడుపార భుజిస్తుంది. నా మాటలునమ్ము. దాల కల్లబొల్లి మాటలకు పొంగి పోకు. లొంగిపోయావా? నీవు యమయాతన పడుచూ మరణిస్తావు. చూస్తూచూస్తూ అట్టి ఘోరమరణానికి పాలుగాకు. అది యిప్పుడు మంచి నిద్రలో ఉంది. దానిని క్రిందికి తోసివేయి. దానిని తిని నా దారిన నేను పోతాను; తెల్లవారగనే నీ దారిన నీవు పోవచ్చు. అని దుర్బోధ చేసింది.

దాని మాటలు ఆ ఉద్యోగికి సత్యంగానే తోచాయి; ప్రాణం మీద ఆశ కలిగింది. పులి చెప్పినట్లుగానే చేస్తేనే మంచిదనినిశ్చయించుకొన్నాడు. వెంటనే భల్లూకాన్ని క్రిందికి త్రోసివేశాడు. కానీ, కపట నిద్రలో ఉన్న భల్లూకం వెంటనే ఎగిరి కొమ్మపై కూర్చుంది; పులికి అందకుండా. ఆ ఉద్యోగి భయంతో ఎంతో గడగడలాడిపోయాడు; భల్లూకం ఏమి చేస్తుందోనని.

పులికి యిప్పుడు మరింత సందు దొరికింది. "చూశావా! వ్యాఘ్రరాజా! మానవుని కుటిలబుద్ధి? నేను చెప్పితే నమ్మావా? ఇప్పుడు ప్రత్యక్షముగా చూశావు గదా?" అంది వ్యాఘ్రము.

అయినా భల్లూకం మనస్సు మార్చుకోలేదు. భయపడుతూన్న ఆ మానవుని దగ్గరకు తీసుకొంది. "వ్యాఘ్రరాజా! నాకు నీ కంటే మానవుల సంగతి బాగా తెలుసు. "తెల్లనివన్నీ పాలు; నల్లనివన్నీ నీళ్ళు" అని నమ్మే అమాయకులు మానవులు. ఇతడు నీ దుర్బోధలు నమ్మి, ప్రాణభీతితో ఈ అఘాయిత్యాని పాల్పడినాడు. నీవు యిలా యేదో దుర్బోధ చేస్తావనే యూహించి యిలా పండు కొన్నట్లు నటించాను. నా ఊహ నిజమైంది. తెల్లవారవస్తుంది:

పోయి వేరే విధంగా నీ యాకలి తీర్చుకో" అని భల్లూకం దానికి సలహాయిచ్చింది.

అప్పటికి బాగా తెల్లవారింది. అందువలనపులి "ఇక తన యాటలు సాగవని" తలంచి వెళ్ళిపోయింది.

అప్పుడు భల్లూకం మానవుని ఉద్దేశించి— "ఓయీ! భయపడకుము. నిన్నేమీ చేయను. అయినా, నీవు స్వార్థపరుడవై ఎదుటి వారికి హాని తెచ్చే కార్యాలు పొరబాటునకూడ చేయకు. ఇదే నేను నీకు చేస్తున్న హెచ్చరిక" అని చెప్పింది.

ఆ ఉద్యోగి దానికి మనసారా నమస్కరించాడు: పశ్చాత్తాపముతో. ఇంతలో కొంతమంది అటు రావడంచూచి, చెట్టుదిగి వారితో వెళ్ళిపోయాడు.

"మహారాజా! విన్నావుగదా! వ్యాఘ్ర భల్లూకముల కథ! ఈ మువ్వురిలో ఎవరి గుణము హర్షించతగ్గదో చెప్పగలవా?" అని భేతాళుడు ప్రశ్నించాడు విక్రమార్కుని.

"భేతాళా! ప్రాణదానం గావించి, తన వాగ్దానము నిల్పుకొన్న భల్లూకము యొక్క గుణమే ప్రధానమైనది! హర్షించ తగ్గదిగూడ" అని విక్రమార్కుడు బదులు చెప్పాడు.

ఈ విధంగా మౌనభంగం కావడంతోనే భేతాళుడు ఎగిరిపోయి చెట్టునాశ్రయించాడు. విక్రమార్కుడు తన పట్టువిడలేదు. తిరిగి చెట్టువైపు ప్రయాణం సాగించాడు.

పట్టుదల వీడని విక్రమార్కుడు తిరిగి చెట్టువద్దకు వచ్చాడు: భేతాళుని బంధించి భుజముపై వేసికొని, సన్యాసి ఆశ్రమానికి బయలుదేరాడు. భేతాళుడు ఇంకొక కథ ప్రారంభించాడు.

# భేతాళుడు చెప్పిన ఆఖరికథ

పూర్వం ద్రవిడదేశంలో గల ఒక నగరాన్ని దయాకరుడను రాజు పాలించేవాడు. అతడు చాల సున్నిత హృదయం గలవాడు; ప్రజలను చాల దయతో పరిపాలించేవాడు; ఆతని పేరుకూడ అందుకు సార్ధకమైంది.

ఆతని మెత్తదనం గమనించి శత్రురాజులు ఆ నగరాన్ని ఆక్రమించారు. దయాకరుడు అహింసాపరుడు కావడంవల్ల ప్రజానష్టాన్ని సహించలేక రాజ్యాన్ని విడిచిపెట్టి అడవులకు వెళ్ళిపోయాడు.

ఆతనివెంట భార్య రత్నావతి, కుమార్తె సుగుణావతి మాత్రమే యున్నారు. అడవిలో ఒకచోట చిన్న పర్ణశాల వేసుకొని ఉంటున్నారు.

అయినా, వారికి శత్రుభయం తప్పలేదు. శత్రురాజులు దయాకరుని ఉనికి తెలిసికొని— ఒక అర్ధరాత్రి వచ్చి దయాకరుని చంపివేశారు.

పాపము! భార్యయైన రత్నావతి! కుమార్తెయగు సుగుణావతి—ఎట్లో తప్పించుకొన్నారు. కంటికి కనిపించని మార్గాన్ని బట్టి ముందుకు ప్రయాణం సాగించారు.

ఆ మార్గం వెంబడే-ఆ యిద్దరు స్త్రీలు వెళ్ళిన కొంచెం సేపటికే-ఆ సమీపమునగల ఒక నగరాధిపతి, ఆతని కుమారుడు గుర్రములపై వచ్చుచు, ఆ స్త్రీలయొక్క— పాదగుర్తులను చూశారు.

ఆ రాజు యిలా అన్నాడు. "కుమారా! ఈ పాదముద్రలు చూడగా, శుభలక్షణములు గల స్త్రీల పాదములవలె గన్పించుచున్నవి. ఇట్టివారిని పొందినవారు అదృష్టవంతులగుతారని సాముద్రికము తెల్పుచున్నది" అని.

రాజకుమారుడు తండ్రిమాటలు విని, ఆలోచించి యిలా అన్నాడు:

"తండ్రీ! ఈ పాదముద్రలు కొన్ని పెద్దవిగాను, కొన్ని చిన్నవిగాను ఉన్నవి. మనము వీటి ననుసరించి వెళదాము; వారిని కలుసుకుందాము. మా అమ్మ ఎట్లాగూ లేదు కాబట్టి మీరు పెద్దపాదములు గల స్త్రీని పెండ్లాడి, నాకు తల్లిని చేయుడు. నేను చిన్న పాదములు గల చిన్నదానిని పెండ్లాడి మీకు కోడలుగా చేస్తాను" అని.

వారు యీ విధముగా నిర్ణయము చేసికొని, బయలుదేరి వారిని కలుసుకున్నారు, తీరా చూసేసరికి పెద్దపాదములు గలది రాజకుమార్తెయగు సుగుణావతి; చిన్న పాదములుగలది రత్నావతి. అయినను, వారు తమ మొదట నిర్ణయం ప్రకారం సుగుణావతిని మహారాజు, రత్నావతిని రాజకుమారుడును పెండ్లి చేసికొన్నారు. ఆ రత్నావతి, సుగుణావతులు కూడ తమ పరిస్థితికి వేరే గత్యంతరం లేక అందుకు సమ్మతించారు.

కొంతకాలానికి మహారాజుకు సుగుణావతి వలన ఒక కుమారుడు, రాజకుమారునికి రత్నావతి వలన ఒక కుమారుడును పుట్టారు.

"మహారాజా! విక్రమార్కా! విన్నావుకదా కథ, ఆ విధముగా జన్మించిన ఆ యిరువురు బాలురు ఏయే వరుసలతో పిల్చుకుంటారో చెప్పవయ్యా! రాజా!" అన్నాడు భేతాళుడు.

విక్రమార్కునికి ఎంత ఆలోచించినను, వారికి వరుసను నిర్ణయించలేక, పోయాడు. సమాధానం చెప్పలేదు. తిన్నగా సన్యాసి ఆశ్రమానికి బయలు దేరాడు.

# భేతాళుని హితోపదేశం

భేతాళుడు విక్రమార్కుని ఉద్దేశించి యిలా అన్నాడు: "మహారాజా! ఈ సన్యాసి చాలాక్రూరుడు. కాళికాదేవి అనుగ్రహంకొరకు యిప్పటికి 99 మంది రాజపుత్రులను మోసగించి దేవికి బలి యిచ్చాడు. నిన్ను గూడ బలి యిచ్చిన 100 అవుతాయి. దేవి ప్రత్యక్షమై అనుగ్రహిస్తుంది.

కావున నీవే యతనిని దేవికి బలియిచ్చి, దేవి అనుగ్రహము పొందుము. నీవు సాహసుడవు, దయాకరుడవు. ప్రజలను పాలించు దయాకరుడవు. కావున, నీ వంటి వాడు బ్రతుకవలెను. నేనుకూడ నీకు వశమై యుందును" అని హితోప దేశం చేశాడు. రాజు విని సంతసించాడు.

క్రమంగా భేతాళునితో సన్యాసి వద్దకు వచ్చాడు విక్రమార్కుడు. అప్పటికే సన్యాసి, దేవీ విగ్రహం ముందు అలికి ముగ్గులు పెట్టి ఉంచాడు. భేతాళ పూజకు, దేవీ పూజకు అగ్ని హోత్రము కూడ సిద్ధము చేశాడు.

సన్యాసి - విక్రమార్కుడు వచ్చి, భేతాళుని దించగానే ఎంతో సంతోషించాడు. "మహారాజా! నీ సాహసం మిక్కిలి కొనియాడతగినది. నాకు ఎంతో మేలు చేశావు, దేశానికిని ఎంతో శుభమును చేకూర్చావు. స్నానము చేసి రమ్ము దేవిని పూజింతము" అన్నాడు విక్రమార్కుడు. స్నానము చేసి వచ్చాడు.

రాజును చూచి - సన్యాసి "మహారాజా! నేను నీవు వచ్చులోపల అంతయు సిద్ధము చేశాను. ఇక నమస్కారము చేయుము. సాష్టాంగముగా నమస్కరింపుము" అన్నాడు.

విక్రమార్కుడు చుట్టూ పరికించి చూశాడు. దేవీ విగ్రహం చెంగటనే వాడియైన ఖడ్గం ఉంది. అతడు సన్యాసిని చూచి "మహాత్మా! నేను మహారాజును గదా! ఒకరి వలన నమస్కారములు పొందుటయేగాని, చేసి యెరుగను. కావున తాము ముందుగా సాష్టాంగముచేసి చూపుడు" అని వినయము నటించుచు పలికినాడు.

సన్యాసికి ఏ అనుమానమూ కలుగలేదు. వెంటనే తాను దేవి ముంగట సాష్టాంగపడి "యిలా చేయాలి" అని పలుకుచుండగనే (భేతాళుని ఉపదేశం ప్రకారం) విక్రమార్కుడు ప్రక్కగల ఖడ్గం తీసి ఒక్కవ్రేటున సన్యాసిని ఖండించినాడు.

వెంటనే దేవి ముంగటగల గంటలు గణగణ మ్రోగినవి. దేవి కాళికా మాత, భేతాళుడు ప్రత్యక్షమైనారు. విక్రమార్కుని దీవించారు. దేవి యిలా అంది: "విక్రమార్కా! నీ సాహసం అమోఘం. నీ కిదివరకే వరాలు నిచ్చాను. యిప్పుడు భేతాళుడు గూడ నీకు వశమైనాడు. భట్టి - భేతాళుర సాయంతో నీవు రెండువేల సంవత్సరాలు హాయిగా జీవించు" అంది.

ఈ విధంగా విక్రమార్క చక్రవర్తి - భట్టి, భేతాళుర సహాయంతో రెండువేల సంవత్సరాలు రాజ్యపాలన గావించినాడు. అనేక సాహసకార్యాలు చేసి ప్రజలకు మేలు గావించినాడు.

విక్రమార్కుని సాహసమును, ప్రజాపరిపాలనమును గాంచి స్వర్గాధి పతి యింద్రుడు- విక్రమార్కుని స్వర్గానికి ఆహ్వానించాడు. 32 సాల భంజికలుగల ఒక సింహాసనాన్ని కూడ బహుమతి చేశాడు.

విక్రమార్కుడు దేవి అనుగ్రహించిన రెండువేల సంవత్సరముల తరువాత - శాలివాహనుడు అను రాజు కారణంగా దివంగతుడయినాడు.

విక్రమార్కుని మరణం తరువాత - దేవేంద్రుడు విక్రమార్కుని కొసగిన సింహాసనం- దానిని అధిష్టించు మహారాజు లేనందువలన- భూస్థాపితం అయింది.

ఆ తరువాత ఎన్నో సంవత్సరాలకు ఆ విక్రమార్క సింహాసనం- "ధారానగరం" పరిపాలించు భోజమహారాజుకు లభించింది.



## ముగింపు

బాలలారా ! పాఠకులారా !

ఇంద్రదప్రసాదమైన విక్రమార్క సింహాసనము నందలి 32 సాల భంజికలు, విక్రమార్కుని వీరగాథలు చెబుతాయి. ఈ కథలు వేరొక పుస్తకంలో మీకు త్వరలోనే అందజేస్తాము.

... స మా ప్తం ...

చదవండి.                                                                 చదివించండి.

## నేటితెలుగులో పిల్లలకు, పెద్దలకు ఉపయుక్తసాహిత్యం

## బాలానంద బొమ్మల బాలసాహిత్యం



బొమ్మల శ్రీషిర్డీసాయి జీవితచరిత్ర
బొమ్మల అక్బర్‌బీర్‌బల్ వినోదకథలు
బొమ్మల తెనాలిరామకృష్ణునిసంపూర్ణ హాస్యకథలు
బొమ్మల ఆలీబాబా 40 దొంగలు
బొమ్మల అల్లావుద్దీన్ అద్భుత దీపం
బొమ్మల గలివర్ సాహస యాత్రలు
బొమ్మల శ్రీ శ్రీ శ్రీ మర్యాదరామన్న కథలు
బొమ్మల భట్టివిక్రమార్కుని సాహస కథలు
బొమ్మల భేతాళకథలు
బొమ్మల మొగల్‌సామ్రాజ్య కథానాయకులు
బొమ్మల ప్రవక్తమహమ్మద్
బొమ్మల ఏసుక్రీస్తు మహిమలు
బొమ్మల మదర్ థెరిసా
బొమ్మల రవీంద్రనాథఠాగూర్
బొమ్మల యోగివేమన
బొమ్మల భగత్‌సింగ్
బొమ్మల అంబేద్కర్
బొమ్మల యశపాల్ కపూర్
బొమ్మల భగవతీచరణ్
బొమ్మల సుభాస్ చంద్రబోస్
బొమ్మల చంద్రశేఖర ఆజాద్
బొమ్మల జయప్రకాష్ నారాయణ్
బొమ్మల సంఘసంస్కర్త రాజారామమోహన్‌రాయ్
బొమ్మల పూజ్యబాపూజీ
బొమ్మల దశావతారాలు
బొమ్మల శ్రీకృష్ణ లీలలు
బొమ్మల పరమానందయ్య శిష్యులు
బొమ్మల శ్రీవెంకటేశ్వర లీలలు

బొమ్మల పంచతంత్రం-2 భాగాలు
బొమ్మల రామాయణం
బొమ్మల భారతం
బొమ్మల భాగవతం
బొమ్మల శ్రీఅయ్యప్ప లీలలు
బొమ్మల శ్రీరామపట్టాభిషేకం
బొమ్మల జైవీరహనుమాన్
బొమ్మల పల్నాటి వీరచరిత్ర
బొమ్మల బాలనాగమ్మ
బొమ్మల శ్రీకాళహస్తి మహోత్యం
బొమ్మల శ్రీశైలక్షేత్ర మహోత్యం
బొమ్మల శ్రీసింహాచల క్షేత్రము
బొమ్మల శ్రీయాదగిరి నరశింహస్వామిచరిత్ర
బొమ్మల శ్రీకాశీరామేశ్వర మజిలీలకథలు
బొమ్మల కోటప్పకొండ చరిత్ర
బొమ్మల శ్రీవినాయక విజయము
బొమ్మల శ్రీభద్రాచల మహోత్యం
బొమ్మల శ్రీపాండురంగ లీలలు
బొమ్మల శ్రీరాఘవేంద్ర లీలలు
బొమ్మల కనకదుర్గ మహోత్యం
బొమ్మల శివ లీలలు
బొమ్మల జగద్గురు శంకరాచార్య
బొమ్మల సహస్ర శిరచ్ఛేద అపూర్వ చింతామణి
బొమ్మల శ్రీసత్యనారాయణ స్వామి వైభవం
బొమ్మల నవగ్రహపూజా మహిమ
బొమ్మల శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి చరిత్ర
బొమ్మల కుశలవుల కథ

